**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

భారతదేశ చరిత్ర / బెజవాడ : వేంకటరాం అండ్ కో., 1927.
2, 60 p. :Ports. :Map. ;19 cm.
Record no. 197

Bhāratadēśa caritra / Bejavāḍa : Vēṅkaṭarāṃ aṃḍ Kō., 1927.
2, 60 p. :Ports. :Map. ;19 cm.
Record no. 197

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB    Date filming began:

శ్రీ

# భారతదేశ చరిత్ర.





ప్రచురకర్తలు:

వేంకటరాం అండ్ కో.,

బెజవాడ.

1927.

...మా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

 [*Price* **0—4—0.**

# ప్రస్తావన

ఒక దేశముయొక్క పేరు ప్రతిష్టలు ఆ దేశచరిత్రనుబట్టి యుండును. దేశీయుల భావిభాగ్యోదయము వారు దెలిసికొను స్వదేశచరిత్రపై నాధారపడియుండును. మన దేశీయులు పాశ్చాత్యదృష్టిలో వ్రాయబడిన చరిత్రలను చదివియే స్వదేశ ఘనమును గాంచలేక విదేశీయుల వరప్రసాదములకు జేసాచి నోళ్లు తెఱచికొని యుండుట తటస్థించినది. భారతీయులు వారి పూర్వీకుల ఉద్గ్రంథములను జూడకుండుటచేతనే విదేశీయుల వ్రాతలు వీరి కాధారమగుచు వచ్చెను. ఇప్పుడిప్పుడు దేశాభిమానులు కొందఱు దేశముయొక్క నిజచరిత్రను గడంగుట శుభావహము. పరిశోధనలుచేయుచుండిరి. సత్యాన్వేషణమునకు పూని పనిచేయుచుండిరి. క్రొత్తక్రొత్త చరిత్ర గ్రంథములు వెలువడుచున్నవి. కాని గ్రంథకర్తలు ఇంకను మన దేశముయొక్క నిజమైన చరిత్రను మరుగుపఱచు చుండుట ఏలకో?

నేను చరిత్ర కారుడగాను. చారిత్రక గ్రంథములనుగాని శాసనములనుగాని చూచి యుండలేదు. కాని మన బాలురకు దేశచారిత్రక జ్ఞానము భారత సాంప్రదాయానుకూలముగను, యథార్థముగనుండునట్లు, వేదభూమి, హిందూ మహమ్మదీయ మహా యుగములు, బౌద్ధ మహా యుగము, శివాజీ చరిత్ర, ఆంధ్రుల చరిత్ర, జీర్ణకర్ణాటక చరిత్ర, అబలా సచ్చరిత్ర రత్నమాల, చంద్రగుప్త మొదలగు చారిత్ర గ్రంథములలోని చారిత్రక విషయముల నొకచో గూర్చి యీపుస్త

కమును వ్రాసితిని. ఏతద్గ్రంథ కర్తలకు కృతానేక నమస్కారములు. ముఖ్యముగా వేదభూమి, బౌద్ధ మహా యుగము, హిందూ మహమ్మదీయ మహా యుగములు రచించిన మ. రా. శ్రీ. అచ్యుతుని వెంకటాచలపతిరావు గారికిని, వేలూరి సత్యనారాయణ గారికిని ప్రత్యేకముగా కృతజ్ఞతజూపుచున్నాను. కె. వి. లక్ష్మణరావు గారిని మరువజాలను.

౪, ౫ తరగతులకు ఇందులోని కథలనేరి చెప్పవచ్చును. ౬, ౭, ౮ తరగతులలో గ్రంథమంతయుం జెప్పనగును.

ఇప్పుడు మనము బిలుచురోం, పూర్వము రోనుకమనియు

ఈజిప్టు ... ఐగుప్త
టిబెట్ ... త్రివిష్టప
పర్షియా ... పారసీక
గ్రీస్ ... యవన
టర్కిస్టాన్ ... తురుష్కయని

వ్యవహరింప బడియుండును. గ్రంథము ఎక్కువ పుటలుగలది కాకపోయినను విషయము ఎక్కువగా నుండుటచే నుపాధ్యాయులెక్కువ శ్రమ తీసుకొనవలసి యుందురు. భారత చరిత్రమంతయు (బ్రిటిషు పరిపాలన గాక) బాలురకు తెలుపుటయే ప్రధానము గాని నాశక్తి సామర్థ్యములు, భాషాజ్ఞానము గుణగ్రహణ పారీణుల కవసర ముండదనియే నేనీ కార్యమునకు సాహసించితిని. తప్పొప్పులను పాఠకులకే వదలి వేయుచున్నను, వ్యాకరణాది దోషములు లెక్కకు మీరియున్నవి. మన్నింతురు గాక.

శ్రీ

# భారతదేశ చరిత్ర.

## ౧

ఉత్తరమున హిమాలయ పర్వతములు, దక్షిణమున హిందూ మహాసముద్రము, తూర్పున బంగాళాఖాతము, పడమర అరేబియా సముద్రము, ఎల్లలుగాగల హిందూదేశమే భారతదేశమనియు, ఆర్యావర్తమనియుం బిలువంబడుచున్నది.

కలియుగ ప్రారంభముతో చారిత్రకాలము ప్రారంభము: క్రీ. పూ. ౩౧౦౨ సంవత్సరమున శ్రీకృష్ణ నిర్యాణ దినము కలియుగ ప్రారంభము. మహాభారతయుద్ధ ప్రారంభమునకే భారతభూమి యఖండ వైభవముల ననుభవించుచుండెను. ఈ యార్యావర్తము కొంతకాలము క్రిందట జలమయమని కొందఱి యభిప్రాయముగాని కొందఱు సృష్ట్యాది నుండియు నార్యావర్తము స్థలప్రదేశముగానే యుండెనని సిద్ధాంతీకరించిరి.

ఆర్యులు—ఆర్యావర్తము లోని వారే ఆర్యులు. ఆర్య యనగా సభ్యుఁడు. సాధువు. వీరు ఇతర దేశముల నుండి వచ్చినవారు కారు. చాలమంచి చరిత్ర కారులు. ఆర్యులు ఆసియా ఖండముయొక్క మధ్య భాగమునుండి

వచ్చి భరతఖండములోని 'దస్యుల' నోడించి సప్త సింధు దేశమునాక్రమించుకొనినట్లు వ్రాసిరికాని దస్యులు, దాసులు, అసురులు, రాక్షసులు వేరును, ఆర్యులు వేరును కారు. యజ్ఞ యాగాదుల నాచరింపక కర్మ భ్రష్టులై యార్య జాతి నుండి బహిష్కృతులైన వారే దస్యాది జాతులుగా వ్యవహరింప బడినట్లు తెలియుచున్నది.

ఆర్యులకు భూజీవనమే ప్రధానము గనుక వారి ప్రార్థనలన్నియు వ్యవసాయ విషయకమైన యైశ్వర్యము నొసంగుమని యైయున్నవి. గోవులు వారికి సర్వస్వము నగుట నిప్పుడు రూప్యములు వాడబడు చున్నట్లు గోవులును వ్యవహారాదులందుపయోగింపబడెను.

ఆర్యావర్తమునం దుద్భవించిన యగ్నిహోత్రుండు, సోముఁడు, ఆశ్వనీ దేవతలు వారి దైవములు.

యుధిష్ఠిరుని రాజసూయ యాగమునకు 'రోమను' లు కానుకలఁ దెచ్చుటయు, రోమను యోధులు పాండ్య రాజ కొలువునం దుండిరనుటయు బట్టిచూడ అనాదినుండియు నితర దేశస్థు లిక్కడకు వచ్చుటయు నార్యు లితర దేశములకేగుటయు ప్రాయికమై యుండ వచ్చును. వైదికార్య మతముతో సంభవించిన విరోధమే కొందఱు విదేశములకు వలస పోవుటకు కారణము. చీనా, లూక్టరీ దేశ ప్రజల వంశావళులలో వారు పురూరవ చక్రవర్తి సంతతి వారైనట్లు వ్రాయబడి యున్నదట.

క్రీ. పూ. 3000 సం॥ లకు ముందే భారత దేశము ఇప్పటి గ్రీసు, రోము, ఈజిప్టు, జర్మనీ దేశములతో వ్యాపారము చేయుచుండెను. మనదేశపు 'పిట్టు' 'కోహినూర్' రత్నములు ఫ్రెంచిరాజుల పాలయ్యెను. 'పిట్టు' రత్నమిప్పటికి 'ప్యారిసు' లో గలదట. దానికిమ్మతు రు 72,00,000 లని మదింపు వేయబడినదట.

వేదవేదాంగములు, గణితము మొదలగు సర్వశాస్త్రములార్యుల కుగ్గుపాలతో నబ్బినవి. ఆయుర్వేదములోని సుశ్రుతము, చరకము, జగద్విఖ్యాతములు. ధనుర్వేదమం దార్యులకు బెట్టినది పేరు. ఆర్యుల శిల్పము నేటికిని విదేశీయుల దిగ్భ్రమ జెందించుచున్నది.

ఆర్యుల రాజ్యములలో కురు పాంచాల దేశములును, కోసల విదేహ దేశములును ప్రాముఖ్యములు. కురురాజులకును, పాంచాలరాజులకును భారతయుద్ధము జరిగిన పిదప కొంతకాలము దేశము శాంతముగ నభివృద్ధి జెందెను. ఆర్యుల బుద్ధివైభవ మభివృద్ధి యయ్యెను. వారు అనేకవిద్యల సాధించిరి. అయినను లోమజాతులు గొంతవఱకు నుత్తమ వర్ణములపై నసూయజెందుటతో మతకలవరములు ప్రారంభమయ్యెను. ఇక్ష్వాకు వంశమున శుద్ధోదనుని పుత్రుండు శాక్యసింహుండు రాజ్యమునకు వచ్చిన వెంటనే నియతముగ పారివ్రాజకవృత్తిఁ జెకొని వైదిక ధర్మ ప్రచ్యుతికి కారకుఁడయ్యె



నని శ్రీ కల్యాణానంద స్వాముల వారు వ్రాయుచున్నారు. [క్రమముగ నీధర్మేతర వ్యాపకము మగధరాజ్యమును జేకొనెను. కలి ౮౦౦ ప్రాంతమున మగధ దేశమును పాలించుచున్న రిపుంజయుని, నాతనియమాత్యుఁడు చంపి, తన పుత్రునిపట్టభద్రునిగావించెను. తరువాత ప్రద్యోతవంశజులేలిరి. ప్రద్యోతవంశజుల నోడించి శిశునాగుఁడు మగధరాజ్యము నాక్రమించెను. శైశునాగులలో దొమ్మిదవవాఁడు నందివర్ధనుఁడు. ఈతను భారతవర్షమునంతను దన యాధీనములోనికి దీసికొనెను.

ఇంతవఱకు నయోధ్యాపురమును పరిపాలించినవారిలో శాక్యుని తరువాతవాఁడు శుద్ధోదనుఁడు. శాక్యసింహుఁడు శుద్ధోదనుని కుమారుఁడు. ఈతఁడే బుద్ధుఁడు.

బుద్ధుఁడు క్రీ. పూ. ౬౨౩లో కపిలవస్తునగరమున జన్మించెను. తల్లియగు మాయాదేవియేడవనాటనేమృతిజెందశుద్ధోదనుని రెండవభార్య గౌతమి ఆశిశువునుపెంచెను. ఇతనికి 'సర్వార్థసిద్ధుఁడని' పేరుబెట్టిరి. చిన్ననాటనే యీబాలుఁడు క్షత్రియోచిత విద్యల నిరసించి రాజ్యభోగాదుల యందు విరక్తిఁ జెందుటచే దండ్రి దిగులువడి కుమారుని బుద్ధి మరల్ప విలాసమందిరముల, కేళీవనముల నిర్మించి వైరాగ్య వృత్తినుండి విముఖునిఁజేయ 'యశోధర' యను చక్కని రాకొమరితను పెండ్లిజేసెను. సిద్ధార్థున కివియన్నియు తుచ్ఛసుఖములు.

సిద్ధార్థుఁడొకనాడు పురవీధులఁ దిరుగుచు పాపిష్ఠా వశిష్టుఁడై యున్న రోగిని, కాటికి గాలు చాచుకొని యున్న ముదుసలిని, బంధుమిత్రులు కన్నీరు మున్నీరుగా నేడ్చుచు వెంటరా స్మశానమునకు గొనిపోబడుచున్న ఒకశవమును జూచి, 'జీవితము దుఃఖమయము, కాయమస్థిరము, సంసార సుఖములు క్షణభంగురములని తలపోసి మోక్షమార్గమును జింతించుచుండు నంతఁ బురమంతయు నర్ధరాత్ర మగుటచే మాటు మణగెను. సిద్ధార్థుఁడు మెల్లన లేచి సుగుణరాశియగు భార్యను, ముద్దుబిడ్డను విడిచిపోయి సంసార బంధములఁ ద్రెంచుకొనెను. పారివ్రాజ్య ధర్మము నవలంబించెను.



బుద్ధుఁడు.

ముప్పదేండ్ల ప్రాయము మించని యౌవనములో వేదముల సమగ్రముగఁ బరిశోధించి కఠోరనిష్ఠ తపముల నాచరించెను. ప్రాణాయామాది యోగము లతనికి లాభము లేకపోయెను. వెంటనే గయకుఁబోయి, యొక యశ్వత్థ వృక్షము క్రింద నిరువదెనిమిది రోజులు నిశ్చల మనస్సుతో యోచించి, పవిత్రజీవనము, నీతివర్తనము, భూతదయ నిర్వాణ మార్గములను కనిపెట్టెను.



గౌతముఁడు (శాక్యవంశీయులకు గౌతమ సంతతి యని కూడ బేరుగలదు.) ఈ నూతన సందేశమును ప్రథమమున కాశీలో నరువది మందికి వెల్లడించెను. వీరు బౌద్ధమతమును (బుద్ధమతము) క్రమముగా నలుదిక్కులకు వ్యాపింప జేయఁ సాగిరి. ఈ సమయమున మగధరాజ్యము నేలుచుండిన బింబిసారుఁడు బౌద్ధ మతమును స్వీకరించుటతో నీ మతమునకు బలము సేకూరెను. క్రమముగా ప్రఖ్యాత పండితులు, మునివతంసులు బుద్ధుని యనుచరులైరి.

మగధలో తన మతమును వ్యాపింపఁజేసి తిరిగికపిలవస్తు నగరముబోయి భార్యాజనకులకుబౌద్ధదీక్షనిచ్చెను. కోసల, కాశీ మగధ రాజ్యములలో బౌద్ధమతము వ్యాపించెను. ఎనుబదేండ్లు నిండిన తరువాత వ్యాధి గ్రస్తుఁడై కుచినగరమున క్రీ. పూ. ౫౮౩ లో పరమ పదించెను. బౌద్ధులతని యస్థులను పలు ప్రాంతములకు దీసి కొనిపోయి వానిపై స్థూపములఁ గట్టి యారాధింపఁ దొడగిరి. ఆంధ్ర రాజులగు శాతవాహనులు బుద్ధుని శల్య ఖండములపై గట్టించిన స్థూప శిథిలములు నేటి

కిని కృష్ణా గుంటూరు మండలములందు అమరావతి, భట్టిప్రోలు, చినగంజాం, జగ్గయ్యపేట, ఘంటసాలలందు నేటికిని కానబడుచున్నవి. గుంటూరు మండలములోని భట్టిప్రోలు గ్రామ మందున్నవట.

◆ ◆ ◆

గౌతముఁడొక మాఁ గరణ్యమున వలలో జిక్కుకొనిన జింకను విడిపించఁగా, దానిఁ జంపనున్న కిరాతుఁడు కోపముతో కత్తి దీసి దూరముననున్న బుద్ధుని నఱకఁబోయి యాతని మోము జూచినంతనే కత్తి విసరి పారవైచి యాతని కాళ్లపైఁబడి రక్షింప వేడెను. బుద్ధుఁడాతనికి ధర్మోపదేశము జేసెను.

ఒకసారి బింబిసారుఁడు తలపెట్టిన యజ్ఞవధకై తీసికొనిపోబడుచున్న మేకలలో నొకపిల్ల కుంటుచు, రోజుచు, నడువలేక నడచు చుండగా బుద్ధుఁడు సహింప జాలక దానిని మోసికొనిపోయి యజ్ఞవేదికపై నెక్కి బౌద్ధమతమును బోధించి యా ఘోర కృత్యమునుండి అక్కడి వారల విముఖుల జేసెను.

పీఠకాత్రయము, జాతగ కథలు, ధర్మపథము, లలిత విస్తరము బౌద్ధమత గ్రంథములు, బౌద్ధసంఘములు, పరిషత్సభలు, మత వ్యాప్తికి దోడ్పడినవి. వైదికుల కర్మ సిద్ధాంతమును బౌద్ధులును విశ్వసింతురు. బౌద్ధమతము వైదిక మతము



నుండి విడివడినదని పలువుర యభిప్రాయము. బౌద్ధభిక్షువులు వైరాగ్య హీనులై విషయసుఖముల మరగుటచే బౌద్ధమతము క్షీణింపదొడగెను.

బుద్ధుఁడు నాత్మవాది కనుక భారతభూమి వైదికధర్మేతరముగ మారెననుట కవకాశములున్నవి. బౌద్ధమత ప్రాబల్యముచే భారతభూమిలో క్షత్రియత్వము, శూరత్వము నశింపగా, చేయి యెత్తిన వానికి భారతీయులు 'దాసోహం' అను స్థితికి వచ్చిరని దేశీయుల తలంపు.

## 3

బౌద్ధ మహాయుగములో ననేకమతకర్త లుదయించిరి.

మహావీరుఁడు—ఈతఁడు క్రీ. పూ. ౫౯౯ ప్రాంతమున వైశాలీ నగరమున జన్మించెను. ఇతనిది లిచ్ఛవీ వంశము. ఈతఁడు ముప్పదేండ్లప్రాయమప్పుడే విరాగియై సన్యాసులలో గలిసెను. కాని వారి మతవ్యాపారము లీయనకు సరిపడనందున 'జైనమత' మను నొకనూతన మతమును ప్రజలకు బోధింపఁదొడఁగెను. ఈతని మతము అంగ, విదేహ, మగధ రాజ్యములలో వ్యాపించెను. ఇదియు హిందూమతము నుండియే పుట్టినది. ఈమతము చాతుర్వర్ణ్య విభేద మంగీకరించును. ఈమతస్థులకు అహింసాధర్మమే ముఖ్య సిద్ధాంతము. పశుపక్ష్యాదులు, వృక్ష, వాయు, శిలమున్నగుపదార్థములందును జీవమున్నదని వీరివాదన. మనుజులసదాచార దురాచారములే

వారినిరక్షించును, శిక్షించునుగానిసర్వేశ్వరుఁడు రక్షింపఁడు, శిక్షింపఁ డనివీరిమతము. భౌతికాధ్యాత్మక పదార్థసమ్మేళనము వలనమనుజుఁ డుద్భవమయ్యెననివీరితలంపు. వేదములుపౌరుషేయములందురు. వీరికివిగ్రహారాధనకలదు. శైవ, వైష్ణవమత ప్రాబల్య ముచేనీమతము క్షీణించెను. అయినను మైసూరు, గుజరాతు, రాజపుత్రస్థానమాదిగాగల ప్రాంతముల నీమత మింకనున్నది. జైనవిగ్రహములుచాలపెద్దవి. జైనదేవళములు విగ్రహములుకృష్ణామండలములోగుడివాడయందు,గుంటూరు మండలమున చందవోలులోను నేటికి కానబడుచున్నవి.

<u>కుమారిలభట్టు</u>—బౌద్ధజైన మతము లడుగంటుట కితఁడు ముఖ్యకారకుఁడందురు. ఈతఁడు జైమినీకృత పూర్వమీమాంసపై భాష్యము వ్రాసెను. ఇతఁడు కర్మవాది. యజ్ఞయాగాది కర్మలవలన ముక్తి కలుగునని యీతని నమ్మకము.

<u>శంకరుఁడు</u>—ఈతఁడు క్రీ. పూ. రెండవశతాబ్దములో దక్షిణ హిందూస్థానమున చిదంబరమున యని కొందఱు, కాశ్మీరమున యని కొందఱుఁ నుదయించెనని చెప్పుదురు. పతంజలి యీతని గురువు. శంకరుఁడు గృహస్థాశ్రమము స్వీకరింపకయే సన్యసించి యద్వైతమతము నాసేతు హిమాచల పర్యంతము బోధించెను. ఇతను దేవతలందఱును వారి వారి యిష్టానుసారము పూజింపవచ్చుననును. మత ప్రాబల్యమునకై ఉత్తరమున బదరీకేదారమునను, దక్షిణమున శృంగేరి



యందును, పడమర ద్వారకయందును, తూర్పున జగన్నాథమునను నాలుగుమఠముల నిర్మించెను. శంకరుఁడు పదేండ్లలో



శంకరాచార్యులు

దన మతమును సర్వత్ర వ్యాపింపఁజేసి ముప్పదెనిమిదవయేట బదరీకేదారములో నీశ్వర సాన్నిధ్యముఁ జేరెను. శంకరుఁ డేర్పఱచిన నాలుగు మఠములు క్షీణించ నంతవఱకు క్రైస్తవ మహమ్మదీమతము లద్వైతమును డాయనైన జాలకుండెను.

ఈ మహా మహుఁడు వేదాంత సూత్రములకు, నుపనిషత్తులకును, భగవద్గీతలకును భాష్యములు వ్రాసెను. వీనిని ప్రస్థానత్రయ మందురు. ఈతఁడు బౌద్ధుల చిత్రవధలు గావించి, వారి స్తూపముల బడగొట్టించినట్లు శత్రువులీతనిపై నింద మోపిరి. శంకరుఁడుమహాశాంతమూర్తి. ఎక్కువ సహనశీలుఁడు. బాలసరస్వతి. ఇట్టిసత్పురుషుఁడు దురాగతము లొనర్చెననుట కడుసాహసము. బౌద్ధమత నాశనమునకే తాను పుట్టియుండిన యెడల గ్రంథములలో నొక చోటనైన బుద్ధుని విషయమై ఒక మాటనైన వ్రాసి యుండఁడా?

<u>రామానుజుఁడు.</u> — ఈతఁడు పెరుంబూదూరు గ్రామములో జన్మించి కాంచీ పట్టణములో విద్య నభ్యసించెను. అచ్చటి చోళరాజు శంకర మతస్థుఁడై నందున నది వదలి మైసూరుపోయి యచ్చటి జైనరాజు కుమార్తె యొక్క రోగము కుదిర్చి యాతనికి వైష్ణవము నిచ్చెను. ఈయన సహాయము వలన వైష్ణవమత ముచ్ఛ్రదశకు వచ్చెను. శివాలయముగానున్న తిరుపతి ఆలయమును వైష్ణవగుడిగా మార్పించెను. ఈతఁడును ప్రస్థానత్రయములపై భాష్యములు వ్రాసెను. శ్రీభాష్య మీతని బ్రహ్మసూత్ర భాష్యము. ఈ మతమును విశిష్టాద్వైతమందురు. ఈయన ముక్తికి భక్తిప్రధాన మనును. శంకరుఁడు జ్ఞానము ప్రధాన మనును. ప్రపంచము మిథ్య కాదనియు, జీవున కెప్పుడును పూర్ణమైన యీశ్వర స్వరూపము రాదనియు రామానుజుని సిద్ధాంతము. శంఖచక్ర గదాధారియు, గరుడవాహనా రూఢుఁడునగు విష్ణువే భగవంతుఁడని యీయన బోధ. రామానుజమతము పంచమ జాతికికూడ నీయబడినది.

<u>మధ్వాచార్యులు</u> — ఈయన మతము ద్వైతము. ఈతఁ డుడిపిలో బుట్టెను. అద్వైతమునకు వ్యతిరేకమైనది ద్వైతము. జీవేశ్వరుల కైక్యమే లేదని యీయన నమ్మకము. ప్రస్థానత్రయమున కీయనకూడ భాష్యము వ్రాసెను. ఈమతస్థులు మధ్వులు.



<u>బసవేశ్వరుఁడు</u> — శైవమతోద్ధారకుఁడు. ఇతనుహింగుళేశ్వరాగ్రహారమున శివభక్తుఁడగు నొక బ్రాహ్మణునియింట జనించెను. బసవేశ్వరుఁడు నందీశ్వరుని యవతారమందురు. ఇతను ఎనిమిదేండ్ల ప్రాయముననే సమస్తవిద్యలు నేర్చుకొనెనట. ఇతఁడుపనయనము చేసికొనక, శివలింగమును ధరించినవాఁడెవఁడైనను గౌరవార్హుఁడని బోధింప సాగెను. ఈతని శిష్యులలో నన్నికులముల వారుండిరి. ఈతని చరిత్ర బసవపురాణములో నున్నది.

౪

కోసలరాజ్యము బలీయమగు రాజ్యము. అది తక్కిన రాజ్యములనణగద్రొక్కి ప్రఖ్యాతిని వహించెను. కానిమగధ రాజ్యము ప్రాముఖ్యతకు వచ్చినదిమొదలు 'కోసల' వెనుకకడుగిడినది. శిశునాగ నృపాలుఁడు గిరివ్రజమును రాజధానిగా జేసికొని మగధను పాలించెను. మొదట నీతఁడు జైనమతావలంబుఁడుగానుండి పిమ్మట బౌద్ధమతమును స్వీకరించెను.

ఇతని పిమ్మట నితని కుమారుఁడు అజాతశత్రుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతని కాలములో తురేనియనులు మగధ రాజ్యముపై దాడివెడలగా వారినిఁ బారద్రోలుటకు శోణనదీ తీరమున పాటలీ పుత్రము నిర్మింపఁబడెను. ఆ సేతు హిమాచల మధ్యస్థమైన భూమినంతయు గడగడలాడించిన మగధ సామ్రాజ్యలక్ష్మి యిక్కడనే పెక్కేండ్లు కాపురము జేసెను.

అజాతశత్రుని తనయుఁడగు దర్శకుఁడు రాజ్యమేలు చుండు కాలమున పర్ష్యాచక్రవర్తి యయిన డెరయసు యొక్క సేనానియగు 'స్కైలాక్సు' పారసీకమునుండి బయలుదేరి సింధు నదీప్రాంతముల జయించి పారసీకమునకు గలిపెను.

శిశు నాగవంశములో కడపటివాఁడగు మహానందివలన శూద్రస్త్రీయందు జనించిన మహాపద్ముఁడను వాఁడు సింహాసనము నెక్కి సకలరాజ కులములను నిర్మూలముఁ జేసి యఖండ సామ్రాజ్య మేలెను. నందరాజులలో గడపటి వాని కాలమున 'నలెగ్జాండరు' చక్రవర్తి భారతవర్షముపై దాడి వెడలి నప్పుడు తక్ష శిలానగరము రాజధానిగా పాంచాల దేశమును పాలించుచుండిన 'ఆంభి' యను రాజు యవన చక్రవర్తి [అలెగాండరు] నాహ్వానించి భారతస్వాతంత్ర్యమును హరించి దేశద్రోహి యయ్యెను. అయినను దేశసేవాభిలాషియుఁ స్వాతంత్ర్యాభిలాషియు నగు పురుషోత్తముఁడను యేలిక కొందఱు క్షత్రియ యోధులతో నలెగ్జాండరు నెదిరింప సాహసించెను గాని లాభము లేకపోయెను.

అలెగ్జాండరు వీరుఁడగుటచేఁ జేజిక్కినవీరపురుషోత్తము నవమాన పఱచక నాతని బహూకరించెను. ఇట్టివాడే గదా శూరుఁడు. 'చంపదగినయట్టి శత్రువు దనచేత, జిక్కెనేని కీడు జేయరాదు, పొసగమేలుజేసి పొమ్మనుటేచాలు......' ఏజాతివారైనను వీరధర్మ మొకటియే !



యవనుల దండయాత్రాఫలితముగా నార్యావర్తపు జ్ఞాన, నిర్యాతిశయములు యవన రోమక దేశములకు బ్రసరించి పాశ్చాత్యాభివృద్ధికి భారతవర్షము ఆదర్శప్రాయమయ్యెను.

అలెగ్జాండరు దండయాత్రానంతరము మహాపద్ముని భార్యయగు మురయను నామె కుమారుఁడు చంద్రగుప్తుఁడు, ప్రజాకంటముగా పాలించుచున్న నందవంశీయులను, అఖండ ప్రతిభాశాలియగు చాణక్యుని (కౌటిల్యుఁడు) సహాయమున నిర్మూలము గావించి క్రీ. పూ. ౩౨౨ సం॥న మగధసింహాసన మధిష్ఠించెను.

❧

చంద్రగుప్తుఁడు—కొలదికాలమునకే "సెల్యూకసు" అను యవనసేనాని మరల నార్యావర్తముపై దాడిసల్పి విఫల మనోరథుఁడై, యదివఱకు అలెగ్జాండరు జయించిన రాజ్యముల గోల్పోయి తన తనయను చంద్రగుప్తునకు సమర్పించి పిడికిట బ్రాణముల బిగియబట్టుకొని మరలిపోయెను. తరువాత క్రీ. పూ. ౩౦౨ న సెల్యూకసు, "మెగస్తనీసు"ను పాటలీపుత్రమునకు రాయబారిగా నంపెను. ఈతఁడు చంద్రగుప్తుని యాస్థానమున నయిదు సంవత్సరములుండి పాటలీపుత్ర సౌభాగ్యమును, ప్రజల సౌశీల్యాదిగుణములను, పాడిపంటలు మొదలగు వానిని వర్ణించెను.

మౌర్యసార్వభౌముని (చంద్రగుప్తుఁడు) పరిపాలనము సర్వాంగసౌష్టవమై, వైభవోపేతమై, ప్రజానురంజకమై నొప్పెను. చంద్రగుప్తుఁడు ప్రజలను గన్నబిడ్డలవలె గంటికి ఱెప్పగా గాచుచుండెను. ధర్మశాసనములకు గట్టుపడి ప్రధానమంత్రి చాణక్యుఁడుగా రాజు, ఎనమండ్రు సభ్యులు గూడిన మంత్రివర్గపు ఆలోచనానుకూలముగా సాంకుశపాలన మొనర్చెను. రాజ్యాధికారము ప్రజాదత్తము. ప్రజాపాలన సౌలభ్యమునకై ననేక శాఖలేర్పఱుపఁబడినవి. ఒక్కొక్క శాఖకొక యధికారియుండును. వేగులవాండ్రు ముఖ్యముగా నుండిరి. సమర్థతాసమర్థతలబట్టి పన్నులు వేయబడెను. మాటిమాటికి క్రొత్త పన్నులచే ప్రజలబీడించువాఁడుకాఁడు. చంద్రగుప్తుఁడు నిష్పక్షపాతముగ దండనము విధించి న్యాయముగా పరిపాలించెను. అనేక కాలువలు, తటాకములు త్రవ్వించి వ్యవసాయమున కెక్కువ తోడ్పడెను. చంద్రగుప్తుఁడు నర్మదానదికి నుత్తరమున నున్న యార్యావర్తమునెల్లఁ దన యేలుబడి లోనికిఁ దీసికొని యిరువది నాలుగేండ్లు సర్వజన సమ్మతముగా నేలి తన పుత్రుఁడగు బింబిసారునకు రాజ్యమొప్పగించి చనిపోయెను.

ఐగుప్త, యవనదేశాధీశ్వరులు బింబిసారుని చెలిమి గోరి రాయబారుల బంపుచు వచ్చిరి. బింబిసారుఁడును దన కీర్తిని యూరపు ఖండములో విస్తరింపఁజేసి మహావైభవముతో నిరువదైదేండ్లు రాజ్యము జేసెను. తరువాత నీతని కుమారుఁ డశోకవర్ధనుఁడు పట్టాభిషిక్తుఁడయ్యెను.



౬

<u>అశోకుఁడు</u>——సింహాసనాసీనుఁడగుటకు ఈతఁడు తన సోదరుల బరిమార్చ వలసి వచ్చెననుట కధారములు లేవు. బౌద్ధమతమును స్వీకరించుటకు ముందు దుర్మార్గుఁడు గానుండి బౌద్ధమత స్వీకరణానంతరము దయాళుఁడైనట్లు బౌద్ధమతోత్కృష్టతఁ దెలియఁ జేయుటకై బౌద్ధులు వ్రాసినట్లు చరిత్రకారుల యభిప్రాయము.

అశోకుఁడు క్రీ. పూ. ౨౬౧ సం॥ న కళింగ రాజ్యము జయించెను. ఈ యుద్ధము వలన గలిగిన సంక్షోభ మాతనిలో హృదయ పరితాపము గలిగించి గొప్పమార్పుకు కారణమయ్యెను. నాఁటనుండియు నాతఁడు అహింసా వ్రతదీక్షఁ గైకొనెను. ఆతనికి బౌద్ధమత మభిమాన మతమయ్యెను. అశోకునిది బౌద్ధమతము కాదనియు సాత్వికధర్మ మతమనియు నవీనసిద్ధాంతము నమ్మదగియే యున్నది. అశోకుఁ డాసియా, ఆఫ్రికా, యూరపు ఖండములకు మత ప్రచారకులనంపి వారి గౌరవార్థమై అక్కడక్కడ స్తూపముల గట్టించెను. సింహళద్వీపములో నేటికి సుమారు ౨౦౦౦ లకు పైగా బౌద్ధభిక్షుకులున్నారు. బౌద్ధమత ప్రచారకులు భారతీయులు చిత్రకళలను, శిల్పముల నాయా దేశములలో వ్యాపింప జేసిరి.

అశోకుఁడు పరిషత్సభల నేర్పాటుచేసి బౌద్ధమతధర్మములలోని యభిప్రాయ భేదముల నివారణ చేయించు మతాభివృద్ధికై పాటుబడెను. అశోకుఁడు బౌద్ధక్షేత్రములనెల్ల దర్శించుచు స్తూపములఁ గట్టించుచు వారిపై బౌద్ధ ధర్మముల జెక్కించుచు వెడలెను. ఆతనితో నాతని పుత్రిక నేపాళదేశము వెళ్లి యొకసన్యాసినీయాశ్రమము గట్టించి తుదకందే దేహము చాలించెను. అశోకుఁడు దక్షిణమున పినాకినీనది హద్దుగా నుత్తర హిందూదేశము నంత నేకచ్ఛత్రాధిపతిగనేలెను. ఈతని కాలములో దూరదేశముల బాలించుటకు రాజప్రతినిధులుండిరి. ధర్మోప దేశికులుండిరి. ప్రజాసౌకర్యములకై బాటలు, నౌషధశాలలు, జంతుసంరక్షణశాలలు నుండెను. అశోకుని కాలములోని శిలాస్తంభ నిర్మాణ కౌశలము, శిల్పకళాప్రావీణ్యము నిరుపమానము. ఆతని కాలములో ననేక భాషలు, లిపులు వృద్ధిపొందినవి. అందు పాళీసారస్వతము ప్రధానము.

ప్రభవ సం॥ భాద్రపదమాసపు 'భారతి' లో ఆంధ్ర భారతీతీర్థ శ్రీ బుర్రా లక్ష్మణరావుగారు అశోకుఁడు బౌద్ధుఁడు కాడనియు, అతనిది సాత్వికధర్మ మతమనియు విమర్శించి యుండిరి. మఱియు బౌద్ధమతము ప్రపంచ సంబంధమును వదలుమనును. అశోకుని మతము గృహస్థాశ్రమములనందు వారికే యేర్పడినది. సర్వమతముల సారాంశమే ఈ సాత్వికధర్మ మతమని వారు సిదాంతీకరించిరి.



అశోకుని వార్ధక్యములో నతను తన భార్య చనిపోగానే వేరొక జవ్వనిని పెండ్లియాడెను. ఈమె ధూర్తయగుటఁ నశోకుని ప్రేమింపక నతని తనయుని ప్రేమించెను. ఈ కుమారుఁడు ధర్మవ్రతుఁడగుటచే నామె యీతనిపై నొక నేరము నారోపణజేసి కండ్లుదీయించెనట. తుదకొకానొక బౌద్ధయతి మహిమచే నాతఁడు లబ్ధనేత్రుఁడయ్యె. అశోకుఁడు భార్యను దారుణముగ శిక్షించెనని యొక కథ జెప్పుదురు.

అశోకుని మరణానంతరము బృహద్రథునితో మౌర్యవంశ మస్తమించెను. బృహద్రథుని మంత్రియగు శుంగవంశీయుఁడగు పుష్యమిత్రుఁడీతనిని జంపి మగధ సింహాసన మెక్కెను.

## ౨

పుష్యమిత్రుని — కాలములోనే బౌద్ధమతము క్షీణించి వైదికమతము విజృంభించినది. ఖారవేలమిళిందులు మగధపై దండెత్తిరి. మిళిందుఁడు యవనదేశపురాజు. ఈతఁడు పశ్చిమ భారతఖండము నాక్రమించెను. మధురానగర మీతని వశమయ్యెను. పుష్యమిత్రుఁడాతనినెదిర్చితరిమివేసెను. తరువాత పుష్యమిత్రుఁ డశ్వమేధయాగము సేసెను. ఈకథయే మాళవికాగ్నిమిత్రనాటకము. పతంజలి పుష్యమిత్రునియాస్థానములోనివాఁడని కొందఱును, ఇంతకుబూర్వమే ౩౦౦యేండ్లక్రిందటివాఁడని మఱికొందఱు నభిప్రాయ పడుచున్నారు. పుష్యమిత్రుని తరువాత చాలమంది రాజులు మగధనేలిరి. వీరికి కాణ్వాయన

ద్విజులు మంత్రులు. తరువాత కాణ్వద్విజులలో నలుగురు రాజులు ౪౫౦ సం॥లు రాజ్యముఁ జేసిరట. ధాన్యకటకాధీశ్వరుఁడును, ఆంధ్రసామ్రాజ్యాధిపుఁడునగు శ్రీముఖ శాతహనుఁడు మగధ రాజ్యమును జయించుటలో మగధ ఆంధ్రుల పాలయ్యెను.

౫

<u>ఆంధ్రరాజులు</u>—క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునకు ముందే ఆంధ్రరాజ్యమున్నత దశయందుండెను. ఆంధ్రవిష్ణువీరాజ్యస్థాపకుఁడని పలువురి యభిప్రాయము. శ్రీకాకుళము దీనికి రాజధాని. ఆంధ్రవిష్ణు సంతతి వారాంధ్ర రాజ్యమును మూఁడుశతాబ్దములేలిరి. తరువాత శాలివాహనులు ఆంధ్రరాజులైరి. బౌద్ధమత ప్రాబల్యమున నిర్వీర్యమై నిస్తేజమైన భారత వర్షములో శక, యవనమూకలఁ జెండాడగలిగినది ఆంధ్ర రాజులొక్కరే. శాలివాహనవంశమునకు శాతవాహనుఁడు మూలపురుషుఁడు. వీని కథలు సోమదేవుని కథాసరిత్సాగరమందు గాననగును. ఇతఁడు ధాన్యకటకమును రాజధానిగాఁ జేసికొని ప్రఖ్యాతుఁడయ్యెను. శాతవాహనుఁడే శాలివాహనుఁడు. తరువాత శ్రీముఖ శాతవాహనుఁడు వీరాధివీరుఁడై మగధరాజులకుఁ బ్రక్కలోని బల్లెముగా నిరువది మూఁడు సంవత్సరములు రాజ్యముఁ జేసెను. అనంతరము రాజ్యమేలిన శాలివాహన వంశజులలోని హాలశాతవాహనునితో (క్రీ. శ. ౭౮) శాలివాహన శకమారంభమయ్యెను. హాలశాతవాహనుఁడు శూరుఁడును కవిపోషకుఁడును.



కొంత కాలమునకు పహ్లావ, యవన, శాకులాంధ్ర దేశముపై దాడివెడలిరి. అనేకరాజ్యముల స్థాపించిరి. ఘూర్జర రాజ్యమును పాలించిన ఋషభదత్తుఁడు మిగుల దానశీలుఁడు. దేవబ్రాహ్మణ పక్షపాతి. ఇతఁడనేక ఆరామములు, విశ్రాంతి గృహములు, బౌద్ధసన్యాసులకు విహారములు నిర్మించెను. శాక, యవన, పహ్లావులు హిందువులతో సంబంధ బాంధవ్యములు నెఱపిరి.

గౌతమిపుత్ర శాతకర్ణి ధాన్యకటకసింహాసన మధిష్ఠించి శక పహ్లావాదుల నోడించి ఆంధ్ర సామ్రాజ్యమును రక్షించినమహాయోధుఁడు. ఇతఁడుబౌద్ధమతాభిమాని. ఈతని రాజ్య ముత్తరమున గంగానదినుండి దక్షిణమున కాంచీపురమువఱకు వ్యాపించి యుండెనట. గౌతముని మరణానంతరము యజ్ఞ శ్రీ శాతకర్ణితో నాంధ్రప్రభ యొఱగెను.

౬

<u>కనిష్కుఁడు</u>—క్రీ. పూ. ౧౬౦ సం॥ ప్రాంతమున తురేనియను తెగలు మధ్యాసియానువీడి రాజధ్వంసముఁ జేయుచు హిందూదేశముఁ బ్రవేశించినవి. వానిలో కుషాను తెగకుఁ జెందినవాఁడు కనిష్కుఁడు. ఈతఁడు క్రీ. శ. ౧౨౦ సం॥ ప్రాంతమున రాజ్యభారమును వహించి బౌద్ధ మతాభిమా

విద్యై కళలు, సారస్వతములను వృద్ధిలోనికిఁ దెచ్చెను. ఈతఁడు యుద్ధములందే కాలముగడిపెను. చీనా సామ్రాజ్యములోని పెక్కు దేశముల జయించెను. బౌద్ధమతమునుండి 'మహాయాన' మను నొక శాఖవెడలి కనిష్కుని కాలములో నఖండముగ వ్యాపించెను. ఈతఁడు హైందవ సారస్వతాభివృద్ధికి శ్రమఁజేసెను. చరకుఁడుఁచరక సంహిత (గంథకర్త) ఈతని యాస్థానములోని వాఁడట. ఇతని తరువాతవారంతటి పరాక్రమశాలురు కానందున నీవంశము మూఁడు శతాబ్దములు దాటిన తరువాత నంతరించెను.

కొంతకాల మౌర్యా నత్తములో తురుష్క ప్రాబల్యము హెచ్చిపోయెను. బౌద్ధసంఘములలో దుర్వ్యయములు దుర్నీతులు పొడసూపెను. బౌద్ధమత వ్యాపకము యొక్క ఫలితముగ క్షత్రియ వీరులు. సన్యాసులై పరరాజుల నుండి భారతవనిని రక్షింప జాలరైరి. ఈసమయములో పాటలీపుత్రపు రాజైన వేరొక చంద్రగుప్తుఁడు స్వాతంత్ర్య రథము నడిపి దేశములోని నల్లరుల నణచివైచి యుత్తర భారత మండలి పెక్కురాజ్యముల జయించి సార్వభౌముఁడయ్యెను. తరువాత నీతని తనయుఁడు సముద్ర గుప్తుఁడు రాజయ్యెను.

<u>సముద్ర గుప్తుఁడు:</u>—ఈ మహాచక్రవర్తి యేకచ్ఛత్రాధిపతిగా నేలవలెనని సంకల్పించుకొని యనేక దండయాత్రలను సల్పి యుత్తర భారతమును జయించి దక్షిణమున



నాంధ్ర, చోళ, పాండ్య, చేర రాజ్యములను వశము జేసికొని యశ్వమేధ యాగముఁ జేసి తనయఖండ విజయమును బ్రకటించెను. మౌర్యరాజుల కాలములో జీర్ణించి పోయిన సంస్కృతభాష గుప్తరాజుల కాలమున షోడశకళలతో, దనరారెను. వైదికమతవ్యాపనమునకై బ్రాహ్మణయతులు ధర్మోపదేశము సేయఁదొడగిరి. మూ[illegible] మూలల కొదిగిన సంస్కృత పండితులు గుప్త చక్రవర్తుల యాస్థానము నలంకరించిరి. కాని బౌద్ధసంఘములనుగాని, విద్యాలయములగాని నాశముఁ జేయలేదు. బౌద్ధమతముపై వైరము బూనలేదు.

<u>రెండవ చంద్రగుప్తుఁడు:</u>—ఈతఁడును పెక్కురాజ్యముల జయించి విక్రమార్కుఁడను బిరుదునొందెను. [ఇతఁడు కాళిదాసాదులఁ బోషించిన విక్రమార్కుఁడుగాఁడు] ఇతఁడు బంగాళము, పాంచాలములఁ జయించి ఢిల్లీలో లోహమయమైన విజయస్తంభమును బాతించెను. శకరాజులు పాలించుచున్న మాళవ, సౌవీర, సౌరాష్ట్రము లితని పాలనలోనికి వచ్చెను. పాహియాన్ యను చైనాయాత్రికుఁ డితని కాలములోనే భారతవర్షమున కరుదెంచి బౌద్ధక్షేత్రములఁ దర్శించి (చంద్రగుప్త) విక్రమార్కునికాలపు భారతవర్ష స్థితిని వర్ణించుచు నప్పటి ప్రజల గుణశీలములకు మహాదానందము నొందెను.

చంద్రగుప్త [విక్రమార్కుని] ని తరువాత కుమారగుప్తుఁడు, స్కంధగుప్తుఁడు రాజ్యమేలిరి. చివరవానికాలములో

హూణులుభారతదేశముపై బడిరి. స్కంధగుప్తుఁడు హూణులఁ దరిమివేయగా హూణులు బెగ్గిలి పండ్రెండు సంవత్సరముల వఱకు మన దేశములో గాలిడజాలరైరి. తరువాత మరల హూణులు హిందూదేశముపై దండయాత్ర సలిపినప్పుడు గుప్తరాజులుడీకొనఁజాలరైరి. హూణులు తోడేళ్ళగుంపులవలె నతిఘోరముగఁ బ్రజలఁ హింసించిరి. గాంధారము, మాళవము వారి స్వాధీనమయ్యెను. హూణనాయకుఁడగు తోరమానుఁడు పశ్చిమోత్తర ప్రాంతమెల్లఁ జయించి, తన కుమారుఁడగు మిహిరకులునకుఁ బట్టముఁగట్టి విశ్రాంతిఁ బొందెను. మిహిరకులుఁడు రాక్షసుఁడు. అతిక్రూరుఁడు. భారతవీరులగు బాలాదిత్యుఁడును, యశోవర్మయును గొప్ప సైన్యములఁ గూర్చికొని మిహిరకులునిఁ బట్టిరి. హైందవులు ధీరులు, ధర్మజిజ్ఞాసులు గావున రణరంగమునఁ బట్టువడినవానిని దేశము నుండి వెడలిపొమ్మనిరి. ఈశత్రువు కాశ్మీరరాజుకడఁదలదాచుకొనెను. శరణాగతుఁడై వచ్చెఁగావున గాశ్మీరరాజుధర్మమాలోచించి సంశయింపకఁ జిన్నజాగీరుగూడ నిచ్చెనట. ఈ విశ్వాసఘాతకుఁడువెంటనే చెలరేగి తనస్వామిని, కాశ్మీరరాజును, జంపి బౌద్ధవిహారములఁ నాశనముఁ జేసెను. పాపము పండిపోయినది. ఒక్కసంవత్సరములో మిహిరకులుఁడు నశించెను. హూణరాజ్యములు క్రుంగిపోయెను. అయినను గుప్తసామ్రాజ్యము విస్మృతమైపోయెను



## ౧౦

విక్రమాదిత్యుఁడు:— అనంతరము ప్రాముఖ్యత గడించిన రాజ్యములలో మాళవము మేటిరాజ్యము. విక్రమాదిత్య బిరుదముతో యశోవర్మఁడు రాజ్యములనెల్ల జయించి ఉజ్జయినిరాజధానిగా జేసికొని మాళవరాజ్యమునకు రాజ్యాధిపతియయ్యెను. ఇతను తన కాలము నెక్కువగా విద్యావ్యాసంగములోఁ గడిపెను. ఈతని యాస్థానముననే కాళిదాసు మహాకవి, ధన్వంతరి, క్షపణకుఁడు, అమరసింహుఁడు, శిల్పశాస్త్రకోవిదుఁడగు శంకుఁడు, మంత్రశాస్త్రవేత్తయగు వేతాలభట్టు, ఘటకర్పరుఁడు, జ్యోతిశాస్త్రనిపుణుడగు వరాహమిహిరుఁడు వరరుచియని నవరత్నములనఁబడు తొమ్మిదిమంది పండితులుండిరి. ఇట్టికవులు నేఁడుద్భవిల్లనందులకుఁ గారణము పండితపోషకులు లేకపోవుటయే.

శిలాదిత్యుఁడు— విక్రమార్కుని తరువాత క్రీ. శ. ౫౮౩ లో బౌద్ధమతాభిమానియగు శిలాదిత్యుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడసమర్థుఁడై భారతదేశమునకు సహజశత్రువులగు హూణశకరాజుల చెలిమిఁ గోరుటచే భారతరాజులు దేశస్వాతంత్ర్యమునభిలషించి శిలాదిత్యుని యుద్ధమున నోడించిరి. శిలాదిత్యుఁడు సిగ్గులేక మరలఁ దిరుగబడి స్థానేశ్వరపు రాజైన రాజవర్ధనునిచే జయింపబడెను. మాళవరాజ్యమంతరించెను. అనంతరము రాజ్యవర్ధనుని సోదరుఁడు శ్రీహర్షుడుఁ సింహాసనమునకు వచ్చెను.

శ్రీహర్షుఁడు.—పదునారేండ్లు ప్రాయముగల శ్రీహర్షుఁడుత్తర హిందూస్థానమునకు క్రీ. శ. ౬౦౬ లో రాజైయారు సంవత్సరములు నవ్యాహతముగఁ బోరి సార్వభౌముఁడని పేరొందెను. ఇతనికభిమానమతము బౌద్ధమతము. ఈతఁడుత్తర భారతము జయించి దక్షిణాపథమున రెండవ పులకేశునితో నోడి సమరముఁ జాలించి పరిపాలనా విషయమై శ్రద్ధఁదీసికొనెను. శ్రీహర్షునకు కన్యాకుబ్జము రాజధాని. ఈతనియాస్థానమున బాణకవి యాస్థాన పండితుఁడు. గద్యకావ్యమైన కాదంబరి రచించినదీపండితుఁడె. ఈ రాజు యాస్థానములో భర్తృహరి, సూర్యశతకము, మయూరాష్టకము మున్నగు గ్రంథములు వ్రాసిన మయూరకవి కూడనుండిరి. శ్రీహర్షుఁడు గొప్పకవి. రత్నావళి, ప్రియదర్శిక, నాగానందములనబడు నాటకముల రచించెను. ఇతని కాలములో మహోత్కృష్ట దశలోనున్న నలందా విశ్వ విద్యాలయమునకు జపాను, చీనా దేశములనుండికూడ విద్యార్థులు వచ్చిరి. ఈతఁడు పరరాజులు తన కడకుఁ బంపు రాయబారములఁ బాటించుచుఁ దాను మరల వారికడకు రాయబారులఁ బంపి స్నేహబాంధవ్యములఁ గలుగజేసికొని సురక్షితముగ రాజ్యమేలెను. ఈతఁడు బౌద్ధమతములతోఁ బాటు దేవాలయములఁ గూడఁ నిర్మించి సర్వమత సమత్వమును చాటెను.

ఈతని కాలములో 'హ్యూయన్ త్సాంగ్' అను చీనా యాత్రికుఁడు మన దేశమునకు వచ్చి శ్రీహర్షుని



పరిపాలన గూర్చియు, నప్పటి దేశస్థితిని గూర్చియు వర్ణించెను. శ్రీహర్షుఁడయిదు సంవత్సరముల కొకమారు ప్రయాగక్షేత్రమున 'సత్రోత్సవము' లను పేరుతో త్రిమూర్త్యారాధనములు బుద్ధుఁడు, విష్ణువు, మహేశ్వరుఁడు నలిపి యన్నవస్త్ర సువర్ణ దానములు సేయుచుండెను. తుదకు నాఱవసత్రోత్సవములో దన సర్వస్వము దానముజేసి కాషాయాంబరముల ధరించుటతో నాసత్రము ముగిసెను. హ్యూయన్ త్సాంగ్' నలందాకుఁబోయి యోగశాస్త్రము నభ్యసించెను. ఇతను తిరిగి చీనారాజ్యముఁ జేరి మన దేశమునుండి తీసికొని వెళ్ళిన సంస్కృత గ్రంథముల చీనాభాషలోని కనువదించుటతో జీవితము వెళ్లబుచ్చెను.

౧౧

ఏడవ శతాబ్దమునుండి పండ్రెండవ శతాబ్దము వఱకు నుత్తరమునను, దక్షిణ భారతమునను రాజపుత్రులు స్వతంత్ర రాజ్యముల నేర్పఱచుకొని యెవరికి వారు స్వతంత్రులుగానుండి పరస్పరము బోరాడు కొనుచుండిరి. సార్వభౌముఁడొక్కఁడును లేఁడయ్యె. ఇది యదనుగా తురుష్కులు భారతవర్షముపై దండెత్తుచు వచ్చిరి.

మహమ్మదు:—మన దేశమునకు బశ్చిమముననున్న యరేబియా దేశములో మక్కాయను పట్టణము మంచి దశయందుండెను. అక్కడ క్రీ. శ ౫౭౦ మహమ్మదు అనునతఁడు

పుట్టి తన మహమ్మదీయ మతమును వ్యాపింప జేయుచుండెను. చిన్ననాటనుండియు నితను ధర్మచింతన గలవాఁడు. 'విగ్రహారాధన కూడదు. ఈశ్వరుఁ డొక్కఁడు. మద్యపానము నిషేధ' మని సీతఁడు బోధించును. ఇతనికి శత్రువు లధికమగుటచే క్రీ. శ. ౬౨౨ లో మదీనాకు బారిఁపోయి నప్పటినుండియు 'హిజరీ' శకము ప్రారంభమయ్యెను. అప్పటికీతని వయస్సు డెబ్బది సంవత్సగములు దాటెను. శత్రువుల బాధ యెక్కువగుటఁ మహమ్మదనుచరులందఱుఁ గత్తిబట్టి ఐరోపా, ఆసియాఖండములలో మతవ్యాపనముఁ జేయవలసి వచ్చెను. మక్కాలోనున్న 'గాబా' దేవాలయములోని విగ్రహములను మహమ్మదు నాశనముఁ జేసెను. మహమ్మదు టర్కీ జయించిన తరువాత క్రీ. శ. ౬౩౨ లో దైవసాన్నిధ్యముఁజేరెను. మహమ్మద్ మతపీఠము నధిష్టించిన వారిని 'ఖలీఫా' లందురు. వీరి పీఠమునకు 'ఖలాఫ' త్తని పేరు. ఖలీఫాలు, వారిస్త్రీల ప్రోత్సాహము గొలది యుద్ధములు సేసి మతమును వ్యాపింపఁ జేయుచు సిరియా, పరిషియా, ఈజిప్టు దేశముల గెలిచిరి. క్రైస్తవుల పుణ్యక్షేత్రమైన 'జెరుసిలం' మహమ్మదీయుల స్వాధీనముకాగా క్రైస్తవ రాజులకును, మహమ్మదీయులకును గొన్నివందల సంవత్సరముల వఱకు మతయుద్ధములు జరిగెను.

రెండవ 'ఖలీఫా' యీజిప్టు దేశములోని యొక గొప్ప పుస్తకభాండాగారమును దగులఁబెట్టెను. నాల్గవఖలీఫా



ఆలీయనువాఁడు మహమ్మదు మేనల్లుఁడు. ఇతనికాలములో జరిగిన ఖలాఫత్తు యుద్ధములలో నితను చంపఁబడగా నతని యిద్దఱు కుమారులు, హస్సేన్, హుస్సేన్ అనువారలు పారసీకమునకుఁ బారిపోయి యాఱవ ఖలీఫాకాలములోఁ జంపఁబడిరి. ఈ క్రూరకృత్య సూచకములే పీర్లపండుగులట.

తరువాత మహమ్మదీయులు టర్కీ, పారసీకము, ఆఫ్గనిస్థానములఁ జయించిరి. పారసీకులు మన దేశములోని గుజరాత్ ప్రవేశించిరి. క్రీ. శ. ౭౧౧ ప్రాంతమున మహమ్మద్ కాసీమ్ మరణానంతరము మహమ్మదీయులు హిందువులచేఁ దరిమివేయబడిన తరువాత మూఁడువందలు సంవత్సరముల వఱకు మన దేశమునకు వారివల్ల బాధలు విశేషము లేకుండెను.

## ౧౨

<u>మహమ్మద్‌గోరి</u>—ఖలీఫా యధికారము తగ్గిన తరువాత మహమ్మదీయ మతమును స్వీకరించిన పారసీకులు తురకలను జయించి వారిని తమలో జేర్చుకొనిరి. అనేకమంది రాజులు స్వతంత్రులైరి. అట్టివారిలో గజ్నీపట్టణమును రాజధానిగా జేసికొనియుండిన 'అలప్తగీన్' అనువాఁడొకఁడు. తరువాత గజ్నీమహమ్మదు హిందూదేశముపై దండెత్తివచ్చి హిందూదేవాలయములను, పట్టణములను నాశనముజేసి ధనరాసులనెత్తించికొనిపోయెను. పంజాబు దేశమును పరిపాలించు

చుండిన జయపాలుఁడు మహమ్మదు నెదిర్చి గెలువలేక ప్రాణత్యాగముఁ జేసెను. తరువాత నితని కుమారుఁడు అనంగపాలుఁడు రాజై మహమ్మదు నెదుర్కొనెను. హిందూ స్త్రీలు నగలనమ్మి ధనమును బంపిరట. అనేకమందియువకులు దేశరక్షణార్థమై సైన్యములోఁ జేరిరి. అయినను తుదకు దైవము హిందువులకుఁ బ్రతికూలుఁడయ్యెను. అంతనాతఁడు నగరకోట దేవాలయమును గొల్లగొట్టెను. ఇట్లు మహమ్మదెనిమిది దాడులుసలిపి తొమ్మిదవసారి కనోజ్ మధురానగరముల దోచెను. పదియవదాడిలో మహమ్మను పరాజితుఁడై పదునొకండవ దాడిలో లాహోరు ప్రాంతమును గజ్నీరాజ్యములోఁ గలుపుకొనెను. తుదకు ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటిగాఁ బేరునొందిన సోమనాథ దేవాలయముపై బండ్రెండవ దాడిసలిపెను. వేలకొలది గ్రామము లగ్రహారములుగా నీయాలయము క్రింద నున్నవి. కోట్లకొలది ధనము దోచుకొనుటకు మహమ్మదుకుఁగోర్కెపుట్టె క్రీ.శ. ౧౦౨౬సం॥ లో దేవాలయమును ముట్టడించి లోనిలింగమును పగులఁగొట్టి రత్నరాసుల నెత్తించుకొని పోయెను. దారిలోఁ దన్నెదుర్చుట కనేకమంది రాజులు సిద్ధపడియుండిరని దెలిసికొని మహమ్మదెడారి దారినిఁబోగా నన్నపానములు దొరకక, నెండకు మలమలమాడి చాలమంది సైనికులీల్గిరి.

మహమ్మదు మరణానంతరము 'గోర్' మండలాధీశుఁడగు 'అల్లాయుద్దీను' అను నాతఁడు గజ్నీరాజు నోడించి



యుఁ రాజ్యమును స్వాధీనముఁ జేసికొనెను. తరువాత 'శహాబుద్దీన్‌గోరి' యీ దేశములో దురుష్కరాజ్యము నేర్పరచెను.

పృథ్వీరాజు — ఆకాలమందు చాలకాలము నుండి పేరువడసియున్నది కనోజి రాజ్యము. ఇది చాలానందమైనది. దీనికి జయచంద్రుఁడు రాజు.

గుజరాత్ దేశము నేలుచుండిన భీమదేవుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు. అబూరాజు కుమార్తెయగు ఇచ్ఛనీ కుమారి నీతఁడు వివాహము జేసికొనదలచెనుగాని నామె తండ్రి యామెను పృథ్వీరాజున కియ్యదలచి యతని సహాయము గోరిన మీదట పృథ్వీరాజు భీమదేవునినొక యుద్ధములోఁ బరాభవించెను.

పృథ్వీరాజు అజ్మీర్, ఢిల్లీ రాజ్యములకు రాజు. జయచంద్రుఁడు నితఁడు అక్కచెల్లెండ్ర బిడ్డలు. సార్వభౌమ పదవి విషయములో నిద్దఱికి వైరము గలిగెను. మీవాడ్ రాజ్యమునకు రాజైన సమరసింహుఁడు పృథ్వీరాజు బావమఱది.

పూర్వము ఢిల్లీకి రాజు అనంగపాలుఁడు. ఇతనికి జయచంద్రుఁడు పృథ్వీరాజు దౌహిత్రులు. అనంగపాలుఁడు దన రాజ్యమును పృథ్వీరాజునకే యిచ్చి కనోజ్‌రాజును (జయచంద్రుఁడు) చిన్నచూపు జూచి నందున జయచంద్రునకు పృథ్వీరాజుపై నసూయ కలిగెను. వెంటనే జయచంద్రుఁడు, అని

హిలపురపు రాజులను దోడు జేసికొని శహాబుద్దీన్ గోరీసహా
య మపేక్షించెను. పృథ్వీరాజునకు బావమఱదియగు సమర



పృ థ్వీ రా జు .



సింహుఁడు దోడయ్యెను. వీరిద్దఱును గోరీ నేడుసారులోడించి
యేడుసారులును విడిచిపెట్టిరి.

జయచంద్రుఁడు రాజసూయ యాగముఁ జేయదలంచి
నానా దేశరాజుల పాలించెను. పృథ్వీరాజు వెళ్లఁడయ్యె.
ఈ సందర్భముననే జయచంద్రుఁడు దనకుమార్తెయైన రాణి
సంయుక్త యొక్క స్వయంవరము జాటించెను. పృథ్వీరాజు
రాణీసంయుక్త మనస్సును హరించెను. జయచంద్రుఁడు
ఢిల్లీశ్వరు నవమానింప నాయన ప్రతిమను ద్వారముకడ నిల
బెట్టించెను. సంయుక్త పుష్పమాలను దీసికొని భూపతు లం
దఱు సిగ్గుపడ నామాలను ప్రతిమ కంఠమున వైచెను. జయ
చంద్రుఁడు తోడనే, తోకఁ ద్రొక్కిన త్రాచువలె, నెగిరిపడి
నామెను కారాగృహమం దుంచెను. ఢిల్లీశ్వరున కిది తెలిసి
కనోజ్‌ను ముట్టడించెను. ఒండొరుల సైన్యము లెదుర్కొని
రక్తము వెలువలై పారునట్లు పోరుచుండిరి. ఒక సమయమున
జయచంద్రుని సేనాధిపతి ఢిల్లీశ్వరునికంఠముఁ దెగనేయ ఖడ్గము
నెత్తినంతలో నొకశూరుఁ డతనిఁ రక్షించెను. ఈశూరుఁడే
సంయుక్త. ఎట్లో కారాగృహము నుండి వెలువడి తన మనో
హారునకుఁ దోడునీడయై నిలచెను.

ఇప్పుడు పృథ్వీరాజున కనేక కారణములచేత ననేక
మంది శత్రువు లేర్పడిరి. వీరందఱును, హిందూ దేశము
నెప్పుడు కబళింతునాయని లొట్టలు వేయుచున్న, శహాబుద్దీ

గోరిని స్వదేశముపై దాడివెడలుట కాహ్వానించిరి. పాము పిల్లను దెచ్చి పాలువోసి పెంచుచుండిరి. దేశద్రోహులు ! అనేకమంది రాజపుత్రవీరు లీమారు పృథ్వీరాజుతోఁ గలసి దేశస్వాతంత్ర్యమునకై ప్రాణముల బలియిచ్చుటకుఁ బ్రమాణములు సేసిరి. స్థానేశ్వరమునొద్ద యుద్ధము జరిగెను. తుదకు దురదృష్టవశమున దైవబలములేమి భారతదేశము పరరాజుల పాలయ్యెను. తురుష్కులు విజయులైరి. గోరీ ఢిల్లీని ముట్టడించెను. రాణీసంయుక్తాది రాజపుత్ర వీరవనిత లగ్నిహోత్రున కాహుతులై పవిత్రులైరి.

క్రీ. శ. ౧౧౯౪ లో గోరీ జయచంద్రునిఁ జావమోది రాజపుత్రస్థానములో జోథ్‌పురరాజ్యమును నెలకొల్పెను. జయచంద్రుఁడు, తలక్రిందకు కొరివిదెచ్చి పెట్టుకొనిన బుద్ధిహీనుఁడు. కంటనీరుఁ గార్చుచు గంగలోఁ గలిసెను. శహాబుద్దీన్ సరదారుఁడగు కుతుబుద్దీన్ అనువాఁడు గోరీకి ప్రతినిధిగా నిక్కడనుండి గుజరాత్, గ్వాలియరులను స్వాధీనముఁ జేసికొని చిత్తోడ్ గడము మీదికిఁ బోయి, యచ్చట రాణి చేతిలో నోడిపోయినను తరువాత నయోధ్యబంగాళా దేశములను జయించెను.

౧౪

కుతుబుద్దీన్—వంశమునకు బానిసవంశమని పేరు. ఈతఁడు ఢిల్లీని రాజధానిగా జేసికొని నాలుగేండ్లు రాజ్య



మేలెను. ఈతఁడు ఢిల్లీలో దనపేరను కుతుబ్ మీనారను జయస్తంభమును గట్టించి క్రీ.శ. ౧౨౧౦ లో మృతినొందెను. తరువాత నీతని యల్లుఁడు 'అల్తమష్' రాజ్యము జేయుచున్న కాలములో చైనా, తార్తరీదేశములనుండి మొగలులు హిందూదేశమునకు వచ్చి యనేక స్థలములను ధ్వంసముజేసి వెళ్ళుచుండిరి.

రజియా—అల్తమష్ అనంతరమున నాతని కుమారుఁడసమర్థుఁడైనందున నల్తమష్ కుమార్తెయైన 'రజియాకు' పట్టము గట్టిరి. ఈమె మిక్కిలి శూరురాలు. రాజ్యవ్యవహారముల జక్కగా నడపగలదు. రాజసభలకు వచ్చునపుడీమె పురుషవేషముతో నుండును. ఈమె యనంతరము వచ్చిన వారిలో 'నాజరుద్దీన్' ప్రజానుకూలుఁడై పరిపాలించెను.

నాజరుద్దీన్—ఇతఁడు చిన్నతనములో సవతితల్లిచేఁ గారా గృహమందుంచ బడెను. చెరలోనుండి 'ఖురాన్' వ్రాసి యమ్ముకొను చుండెడి వాఁడట. ఈతఁ డేకపత్నీవ్రతస్థుఁడు. ఇంటిపనులన్నియు భార్యయే చేయుచుండును. ఒకనాడు వ్రేళ్లుకాలగా వంటఁజేయఁ జాలక వంటలక్కను మాట్లాడుడని యాసాధ్వి కోరగా, 'నాస్వంత ఖర్చుకు రాజ్యపుసొమ్ము నీయజాల' నని భర్తయనెనట !

నాజరుద్దీన్ తరువాత నాతనిమంత్రి 'బల్బను' రాజయ్యెను. తన రాజ్యమందు మద్యపానముఁ జేసిన వారిని నిర్ద

యతో బహుకఠినముగా దండించెను. ఈతని కాలములో జనులు హాయిగా నిద్రించిరి. బల్బను మనుమడగు 'కైకుబాద్' తో బానిస వంశము నశించెను. తరువాత జలాలుద్దీన్ అను ఖిల్‌జీ వంశస్థుఁడు రాజయ్యెను.

<u>జలాలుద్దీన్</u>—ఇతఁడు సాత్త్వికవృత్తిగలవాఁడు. ఈతని శాంతస్వభావమును చూచి మాళవా ప్రాంతములవారు తిరుగబడిరి. వారుఅణచి వేయబడిరి. క్రీ. శ. ౧౨౯౨ లో మొగలులు పంజాబు మీదకు దండెత్తిరాగా జలాలుద్దీన్ వారి నోడించెను. తరువాత నుభయులకు స్నేహము గుదిరిన మీదట నీదేశములోనున్న మొగలులందరు మహమ్మదీయులైరి.

జలాలుద్దీన్ తమ్మునికుమారుఁడల్లాయుద్దీన్. ఈతఁడయోధ్యా ప్రాంతములకు సుబేదారుఁడు. దక్షిణములో ధనవంతమయిన దేవగిరిని దోచుకొనవలెనని బయలుదేరి తన సంకల్పము నొరులతోఁ జెప్పక హిందువుల మోసగించి దేవగిరిలో రాజ్యము సేయుచున్న యాదవ కులజుఁడును, మహారాష్ట్రరాజుననగు రామదేవరావుకు దెలియనీయక కోటను ముట్టడించెను. రామదేవరావు కొంతవఱకు బోరాడి తుదకు అల్లాయుద్దీనుకు గావలసినంత ధనమునిచ్చి సంధిఁజేసికొనెను. అల్లాయుద్దీన్ పినతండ్రినిజంపి ఢిల్లీ సింహాసన మెక్కెను.



౧౫

<u>అల్లాయుద్దీన్</u>—ఈతఁడు దుర్మార్గపు పనులు జేసెనందురు. ఈతఁడు నిరంకుశుఁడు. ఈతనికాలములో మొగలులనేకసారులు హిందూదేశముపై దండెత్తి వచ్చిరి కానియన్నిసారులు వెడలగొట్టబడిరి.

అల్లాయుద్దీను సేనానాయకుఁడు మలిక్ కాఫూర్ క్రీ. శ. ౧౩౦౯ లో నోరుగంటిరాజు నోడించెను. ఈతఁడు రామేశ్వర క్షేత్రములో మసీదొకటి గట్టించెను.

అల్లాయుద్దీన్ చిత్తోడ్ నగరముపై దాడివెడలెను. చిత్తోడ్ గడమునకు లక్ష్మణసింగు రాజు. ఇతని పినతండ్రి భీమసింగు. భీమసింగుభార్య పద్మిని. ఈమె సద్గుణరాశి. అల్లాయుద్దీన్ పద్మినిని దనకిచ్చిన బోయెదననెను. రాజపుత్రులు స్త్రీల మానధనముల రక్షించుటలో బ్రాణము లీయసిద్ధముగనుండిరి. అల్లాయుద్దీను వ్యర్థమనోరథుఁడై వెళ్ళుచు దనను గౌరవముగా సాగనంప వెంటవచ్చిన భీమసింగును బంధించెను. పద్మిని యొకయుక్తినిబన్ని తాను, రాజపుత్రవీరులు వేరువేరు పల్లకీలనెక్కి వెళ్ళి తురుష్కుల దునుమాడిరి. అంతట నల్లాయుద్దీను వెడలిపోయి మరల ౧౩౦౩ లో దండెత్తివచ్చి కోటనుస్వాధీనము జేసికొనెనుగాని రాజపుత్రవీరులు పోరాడి వీరస్వర్గమును జూఱగొనుటచేతను, రాజపుత్రస్త్రీలపవిత్రులుగాకుండ నగ్నిఁబడి మడియుటఁజేతను తుదకల్లాయుద్దీనునకు భయంకరమై,

గుండెలవియజేయు నిర్మానుష్యమైన కోట చిక్కెను. అల్లాయుద్దీనుకు పృథ్వినంతను జయించవలెనను దురాశయున్నది. కాని యింతలో రాజ్యములోని తిరుగుబాటులవలనఁ గలిగిన క్రోధోద్రేకముచేఁ గృశించి క్రీ. శ. ౧౩౧౬ లోఁ జనిపోయెను.

**ముబారిక్**—అల్లాయుద్దీను తరువాత నతని నాల్గవ కుమారుఁడు, ముబారిక్, సోదరులఁజంపి రాజయ్యెను. ఇతఁడు విషయలోలుఁడు. అయినను దన తండ్రిచే ఖయిదులో నుంచబడిన వారినందఱిని విడిపించి, బాధకరములగు పన్నులఁ దగ్గించి ప్రజలకుఁ గొంత మేలుఁజేసెను. ముబారిక్ దేవగిరిని స్వాధీనము జేసికొనెను. దౌలతాబాద్ అను పేరుతో నిప్పటికి నది మహమ్మదీయుల యాధీనమునందున్నది.

ముబారిక్‌ను జంపి 'ఖుస్రూ' అనువాఁడు రాజయ్యెను. ఇతఁడు తానొక హిందువునని జెప్పుకొనుచు, దురుష్కుల ద్వేషించుచు ఢిల్లీమసీదులలో విగ్రహముల స్థాపింపఁజేసెను. ఖురాన్‌ను అగౌరవముతోఁ జూచెను. పంజాబుదేశపు సుబేదారుఁడగు గ్యాసుద్దీను ఖుస్రూను జంపి సింహాసన మధిష్టించెను.

౧౬

**ప్రతాపరుద్రుఁడు**—గ్యాసుద్దీను ది తుఘ్లఖ్ వంశము. ఈతఁడు సత్యసంధుఁడు. అందఱు మెచ్చునట్లుగా రాజ్య



మేలెను. ఈతని పెద్దకుమారుఁడగు అలూప్‌ఖానుఁడు మహమ్మదీయులకుఁ గప్పమీయుట మానిన యోరుగంటి ప్రతాపరుద్రునిపై దాడివెడలెను. యుద్ధములో మహమ్మదీయులు హతాశులై పాఱిపోయిరి. కాని మరుసటి సంవత్సరము పట్టువీడక మహమ్మదీయులు మరల నోరుగంటిపైబడి దానిని గెలిచి ప్రతాపరుద్రుని ఖైదీగా ఢిల్లీకిఁ గొనిపోయి కొన్నిరోజుల కాతనికి మరల రాజ్యమిచ్చి వదలివేసిరట.

ప్రతాపరుద్రుఁడు వేటకు వెళ్ళినప్పుడు మహమ్మదీయులు దొంగతనముగా నాతని బంధించిరనియు, నది తెలిసికొని యాతని మంత్రిశేఖరుఁడు యుగంధరుఁడు శాబ్దిఁజేసి తన నైపుణ్యముచేఁ బ్రతాపుని విడిపించెననియు మనము ప్రతాపరుద్రీయములోఁ జదువుదుము. నిజమేదో ?

గ్యాసుద్దీను ఢిల్లీసమీపమునఁ గట్టించిన కోటకును, ఢిల్లీకిని భూమిలోనుండి త్రోవయున్నదందురు. ఈతని మరణానంతర మాతని పెద్దకుమారుఁడు మహమ్మద్‌తుఘ్లఖ్ అను పేరుతో గద్దె నెక్కెను.

**మహమ్మద్‌తుఘ్లఖ్**—ఈతఁడరబ్బీ, పారసీభాషలలోఁ బండితుఁడు. ఈతనికి గ్రీక్ తత్వశాస్త్రములో మంచిజ్ఞానమున్నది. మంచి జ్ఞాపకశక్తి యున్నది. ఇన్ని యుండియు నీతఁడు దూరదృష్టిలేని పనులు చాలచేసెను. మొగలులు దండెత్తిరాగా వారికి లంచముబెట్టెను. తిరుగపడిన రాజుల

నణచలేక డబ్బుకొఱకు నధికమైన పన్నులువేసి ప్రజలను వేధించెను. ఢిల్లీవదలి దేవగిరిని రాజధానిగాఁ జేసికొని ప్రజల నక్కడకు రమ్మని, ఢిల్లీ పాడుపడగా, మరలదేవగిరిని విడచి ఢిల్లీకి వచ్చుటలోఁ బ్రజలఁజిక్కులుపెట్టెను. రాగినాణెముల బంగారు నాణెములుగావాడెను. మోసమెక్కువ యయ్యెను. వర్తకులు దరిద్రులైరి. చీనాదేశముమీద కుఁబంపిన దండయాత్రలో ననేకమంది మరణించిరి. తిరుగబాటుచేసిన వారినివేటాడెను. అరాజక మెక్కువయ్యెను. ఎక్కడిరాజులక్కడ స్వతంత్రులైరి.

దక్షిణమున నతని సైన్యాధిశుఁడగు 'హసన్‌గంగూ' తిరుగబడెను. ఇతఁడు మొదట 'గంగూ' యను బ్రాహ్మణుని యొద్ద బానిస. తాను రాజయిన తరువాత అల్లాయుద్దీన్ షాహాయను బిరుదు వహించి తనవంశమునకు బహమ్మన్ (బ్రాహ్మణ) యనిపేరుఁ బెట్టుకొనెను.

తుఘ్లఖ్ మేనల్లుఁడు తప్పుజేసి దక్షిణమున ఆనెగొందిలో రాజ్యము సేయుచున్న జంబుకేశ్వరుని శరణుజొచ్చెను. అందుచే ఢిల్లీశ్వరుఁ డానెగొందిమీఁదికి దండెత్తి జంబుకేశ్వరుని జయించుట కష్టసాధ్యముకాగా తుదకు తనమేనల్లునైన విడిచిపెట్టఁ గోరెను. శరణాగతత్రాణుఁడైన జంబుకేశ్వరుఁడు తుఘ్లఖ్ మేనల్లుని విడువఁజాలక యుద్ధములోఁ బ్రాణము లిచ్చెను. ఆనెగొంది ఢిల్లీశ్వరుని స్వాధీన మయ్యెను. తరువా



తానెగొంది ప్రజలు సాతంత్ర్యము గోరి తిరుగబడిరి. అదివఱ కానెగొందిరాజుకు మంత్రిగానున్న హరి హరరాయలు రాజయ్యెను. ఆతని సోదరుఁడు బుక్కరాయలు మంత్రి యయ్యెను.

౧౨

ఒక్క దౌలతాబాదు దుర్గము తప్ప తక్కిన దక్షిణ దేశమంతయు హరి హరరాయల యధికారములోనికి వచ్చెను. హరిహరరాయలకు మాధవాచార్యులవారును, హరిహరరాయలయన్నకుమారునొద్ద సాయణాచార్యుల వారును మంత్రులు. మాధవాచార్యులవారు సంస్కృతములో నఖండపాండిత్యము గలవారు. వీరు పరాశర మాధవీయము, పంచదశి, శంకరవిజయము రచించిరి. వీరు యత్యాశ్రమము స్వీకరించినను దేశోద్ధరణకై హిందూ సామ్రాజ్యమును నిర్మించిరి. వీరి పేరట విద్యానగరము (విజయనగరము) గట్టిరి. మాధవాచార్యులుగారే విద్యారణ్యులవారు.

హరిహర రాయలు తరువాత బుక్కరాయలు రాజయ్యెను. ఈతని ప్రోత్సాహమున సాయనభాష్యము వ్రాయబడెను. ఈతనికాలములో మాధవుఁడు ప్రసిద్ధిజెందిన మంత్రి. ఇతఁడు సూత్రసంహిత టీకయు, శైవామ్నాయ సారమును రచించెను. ఇతను తురుష్కుల నోడించి 'గోవా' పట్టణమును వశపఱచుకొనెను. తరువాత విజయనగరమును పరిపాలించిన వారిలో శ్రీకృష్ణదేవరాయలు చిరస్మరణీయుఁడు.

శ్రీకృష్ణదేవరాయలు.—ఇతని సవతితల్లి తన కుమారునకే రాజ్యము రావలెనను తలంపుతో రాయలను జంపింప యత్నించగా మంత్రి యగు తిమ్మరుసు రాయలను గాపాడెను. ౧౫౦౯లో రాయలు పట్టాభిషిక్తుఁ డయ్యెను. మంత్రియైన తిమ్మరుసుయొక్క బుద్ధిబలముచేతనే రాయలకు దిగ్విజయములు కలిగెను. కనుకనే రాయలు మంత్రిని 'అప్పాజీ' యని పిలుచును.



శ్రీ కృష్ణదేవరాయలు

ఈమంత్రిశేఖరుఁడు కొండవీడునుజయించి ౧౫౧౫లో దక్షిణ దిగ్విజయ యాత్రకుబయలుదేరి శివసముద్రపుకోటను ముట్టడించి కర్ణాటకం బంతయు జయించి శ్రీరంగపట్టణమును రాజధానిగాఁజేసెను. రాయలు కొండగు, మళయాళముల లోఁబరచుకొని నెల్లూరు మండలములోని యుదయగిరిని స్వాధీనము జేసికొనిన తరువాత రాయచూరును ముట్టడించెను. దుర్గాధిపతికి సహాయముగా 'ఆదిల్‌షాహ' అనువాఁడు పరాక్రమముతో రాయల నెదిర్చి యోడిపోయెను.



రాయలు సంస్కృతాంధ్రములం దద్వితీయమైన పాండిత్యము గలవాఁడు. ఈతనియాస్థానమందు ఆంధ్రకవితాపితామహుఁడగు అల్లసాని పెద్దన మనుచరిత్రమును రచించి రాయల కంకితము సేసెను. పారిజాతాపహరణము రచించిన నంది తిమ్మన్న, రామాభ్యుదయమును రచించిన అయ్యలరాజు రామభద్రుఁడు, రాజశేఖర చరిత్రము వ్రాసిన మల్లన, కాళహస్తి మహాత్మ్యమును రచించిన ధూర్జటి; రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నముల గ్రంథకర్తయగు పింగళి సూరన్న, వసుచరిత్ర, హరిశ్చంద్ర, నలోపాఖ్యానము, నరసభూపాలీయములను రచించిన రామరాజభూషణుఁడు; పాండురంగ మహాత్మ్యమాదిగాగల గ్రంథముల వ్రాసిన రామలింగకవి రాయలయాస్థానమందష్టదిగ్గజములని పిలువబడిరి.

కృష్ణదేవరాయలు వార్ధక్యములో నారేండ్లవాఁడయిన తన కుమారునకు పట్టాభిషేకము జేసెను. దురదృష్టమున నాబాలుఁడు మృతినొందగా దీనికి దిమ్మరుసు కారకుఁడని తండ్రి సమానుఁడగు ఆతని కండ్లు దీయించెను. మహాఘోరము! రాజుల చెలిమి పాములతోఁ జెలిమి. అనంతరము యథార్థముఁ దెలిసికొని రాయలు పశ్చాత్తప్తహృదయుఁడై దిగులువడి తన ప్రాణదాతను దలఁచుచు ౧౫౩౦లో స్వర్గస్థుఁ డయ్యెను. తరువాత వచ్చిన రాజులంత సమర్థులుగాకపోవుటచే విజయనగరము యొక్క వైభవమంతయు నేలఁగలిసెను.

౧౫

మహమ్మద్ తుఘ్లఖ్ మరణానంతరము ఫిరోజ్

యనువాఁడు సింహాసన మెక్కెను. ఇతనికి రాజ్య తృష్ణలేదు. ప్రజాహితుడై తనకున్న దానితో నీతఁడు దృప్తిఁ జెందెను. ఈతఁడనేక సత్రములు, పాఠశాలలు, వైద్యాలయములు గట్టించెను. బావులు తటాకములు ద్రవ్వించెను. గొప్పకాలువలు దీయించెను. దేశము సంపదలతోఁ దులదూగెను. క్రూరశిక్షలు మాసివేయఁ బడెను. కాని హిందూమత ద్వేషి. హిందువులకు 'జిజియా' యను పన్నును విధించెను.

తరువాత ఢిల్లీనేలిన రాజు లంత సామర్థ్యముఁ గలవారు కానందున ఢిల్లీలో నెవరికి వారు స్వతంత్రులై పోట్లాడుకొనసాగిరి. ఈ యదనుఁజూచి తయమూర్‌లంగ్ అను మొగలుఁడు హిందూదేశముపై దండెత్తి వచ్చెను.


తైమూఁరు.

తయమూర్:—ఇతఁడు కుంటి వాఁడు. ఇతఁడు ఢిల్లీని స్వాధీనముఁ జేసికొని కొల్లగొట్టెను. తిరిగి వెళ్ళినప్పుడు పట్టణములఁ గాల్చి వేలకొలది జనులఁ సంహరించెను. బహుక్రూరుఁడు. తురకవంశ మంతరించిన పిమ్మట సయ్యద్‌వంశీయులుముప్పదియారేండ్లు పాలన జేసిరి. అనంతరము ఆఫగనులగు లోడీవంశము వారు వచ్చిరి.



సికిందర్‌లోడీ-ఈ వంశములో నీతఁడు ప్రఖ్యాతపురుషుఁడు. ఈతఁడు విద్వాంసుఁడును, కవీశ్వరుఁడును, ధర్మశాస్త్రవేత్తయునయ్యు హిందూ మతమును ద్వేషించెను. మంచి బాటలను, సంరక్షక భటులను నిర్మించి ప్రజాను కూలుడయ్యెను.

ఇతని తరువాత నీతని కుమారుఁ 'డిబ్రహీంలోడీ పరాక్రమశాలి కానందున 'బాబరు' అను మొగలాయి యిబ్రహీమును క్రీ. శ. ౧౫౨౬లో పానిపట్‌యొద్ద గడతేర్చి ఢిల్లీ సింహాసన మెక్కెను.

ఏ కొలదిమంది పాదుషాలో తప్ప మిగిలినవారందఱు హిందూమతమును ద్వేషించి హిందువుల పలుబాధలు పెట్టినను హిందువులు తమ మతమును మాత్రము వీడలేదు. కాలము గడచిన కొలది పరమత సహిష్టత్వము వీరి కెక్కువయ్యెను. అన్యమతస్థులైనను రాజకీయఉద్యోగములలో నేలకో హిందువుల ననేకులఁ జేర్చికొనిరి. యుద్ధాదులవలన పట్టణవాసులకుఁ దక్క పల్లెవాసుల కొత్తిడి లేకుండెను. కొంకణదేశమును గూర్చి మార్కొఫోలో వ్రాసినట్లుగా, కె. వెం. లక్ష్మణరావు గారిట్లు వ్రాసిరి.

"వర్తక విషయములో నీ ప్రాంతమందలి బ్రాహ్మణులకు గల చాతుర్యము లోకములో మఱియెవ్వరికిని లేదు. ఎట్టికష్టములు సంభవించినను వా రబద్ధములాడరు.....చల్లతో నన్నము తిని వారు విశేష కాలము వఱకు బ్రతికి యుండెదరు........"

౧౯

బాబర్—చిన్నతనములోనే నీతని తండ్రి చనిపోయినందున జ్ఞాతులచే వెడలఁగొట్టఁబడి యాఫ్గనిస్థానముఁ బోయి 'కాబూల్'ను స్వాధీనము జేసికొనెను. ఇతఁడుఢిల్లీసింహాసనము నధిష్ఠించిన తరువాత మేవాడ్ రాజ్యమును జయించెను. ఇతఁడువిద్యావంతుఁడై మద్యపానాది వ్యసనములమానుకొనెను. ఇతఁడు స్వీయచరిత్రమును వ్రాసియుంచి ౧౫౩౦ లో సమాధిఁజెందెను.


బాబరు.



హుమయూన్—ఇతను బాబరు పెద్దకుమారుఁడు. ఈతఁడు సోదరప్రేమ కలవాఁడు. ఈతఁడురాజ్యమునకు వచ్చి గుజరాత్ లోని కోటలను, పట్టణములనుబట్టుకొనెను. ఒక ఆఫ్గన్ సర్దారునితోఁ బోరి గెలువలేక హుమాయూన్ పాఱిబోయి సింధుదేశముఁ జేరెను. దారిలో నీయన హమీదాయను కన్యవల్ల 'అక్ బర్'పుత్రుని బడసెను. తరువాత గొంత పారసీకసైన్యముఁదీసికొని కందహార్, కాబూల్ పట్టణముల నాక్రమించెను. ఇంతలోఢిల్లీలోపదునైదేండ్లు సూర్ వంశస్థులు రాజ్యము చేసిరి. అల్లకల్లోలములు బుట్టెను. ఈ సమయమునుఁ గనిపెట్టి హుమయూన్ ౧౫౫౫ లో పానిపట్ యొద్ద శత్రువుల నోడించి మరల ఢిల్లీగద్దెనెక్కెను. ఇతని మరణానంతర మక్బరు రాజయ్యెను.


హుమాయూన్.

అక్బరు—తండ్రి మరణించునప్పటికి అగ్బరు పదమూడేండ్ల ప్రాయముఁ గలవాఁడు. హుమయూన్ సరదారుఁడగు 'బహిరాంఖానుఁ డగ్బరునకు పోషకుఁడుగను, గురువుగను

నుండి స్వామిభక్తిపరాయణుఁడై మంత్రియయ్యెను. అక్బరు రాజ్యమునకు వచ్చినప్పుడు ఢిల్లీ, ఆగ్రా ప్రాంతములు మాత్రము ఢిల్లీశ్వరుని స్వాధీనములో నుండెను. తరువాత గొప్పరాజ్యమును సంపాదించెను.

అక్బర్ రాజపుత్రులను సఖ్యముచేతను, సంబంధ బాంధవ్యములచేతను లోబఱచుకొనెను. జయపురాధీశ్వరుఁడు తన కూతు నక్బరునకిచ్చెను. జోధపురరాజున కక్బరు తన సైన్యములో గొప్పయధికారము నిచ్చెను.

అక్బరు ౧౫౬౭ లో రాజపుత్రుల నందఱను జయింపఁదలచి చిత్తోడ్ నగరముపైఁబడెను. చిత్తోడ్ రాజగు ఉదయసింహుఁడెంతఁ బోరాడినను ప్రయోజనముఁ లేకపోయెను. ఉదయసింహుఁడు బంధింపఁబడెను. కాని యుదయసింహుని భార్య 'వీరాబాయి' పురుషవేషము, ధరించి రాజపుత్రు లందఱఁ బురికొల్పి రణరంగముఁ బ్రవేశించి తురకలఁ జెండాడెను. ఉదయసింహుఁడు బంధవిముక్తుఁడయ్యెను. అక్బరు


అక్బరు.



వెలవెలఁబోయి వెనుకకు మరలిపోయెను. అక్బరువంటివానికి రాజ్యతృష్ణపోలేదు. రెండవసారి మరల చిత్తోడ్‌ను ముట్టడించి స్వాధీనముఁ జేసికొనెను. రాజపుత్రులు స్వాధీనముకారైరి.

అనంతర మక్బరు గడామండలముపై దాడివెడలెను. గోండురాజు గడామండల సంస్థానాధీశుఁడు. బుందేల్‌ఖండు సంస్థానాధీశుఁడగుచందేల్ రాజుయొక్క ముద్దులపట్టి దుర్గావతి, గోండురాజును వివాహమాడెను. భర్త విషయలోలుఁడై నందున దుర్గావతియే రాజరికము సేయుచుండెను. ఈమె కొక పుత్రుఁడు కలిగెను. ఆబాలునకుఁ బది వత్సరములైన రాకమునుపే రాజు మరణించెను. ఈస్థితిలో నక్బరువంటి మహారాజ యబలపైఁ బడెను. ఈవీరవనితయు నధైర్యపడక శత్రు సైన్యముల నెదుర్కొని చిందరవందరఁ గావించెను. బాలుఁడయ్యు దుర్గావతి కుమారుఁడు దన శూరత్వమును జూపెను. అభిమన్యుని త్రోవఁద్రొక్కెను. అప్పటికి నారాజపుత్ర కేసరి జంకక సైనికుల కుత్సాహము బుట్టించుచు శక్తిరూపముదాల్చి తుదకుఁ బగఱచేతఁ బడక తన్నుదాఁ బొడుచుకొని స్వామి సన్నిధిఁ జేరెను.

అక్బరు గడామండలమును స్వాధీన పఱచుకొని గుజరాత్, బెంగాల్, కాబూల్, కాశ్మీరము, సింధు, కాందహార్ దేశముల లోబఱచుకొని చక్రవర్తి యయ్యెను. దక్షిణమున నహమ్మదునగర్, బీజపూర్, గోల్కొండ నవాబులను వశపఱచుకొనెను.

అక్బరు మిత్రుఁడబుల్ ఫజల్ అనువాఁడు 'ఐనే అక్బరీ' అను గ్రంథమును వ్రాసియందు అక్బరుచరిత్రఁ దెలిపెను. అక్బరు కాలములో నాతనిమంత్రి రాజా తోడరుమల్లుఁడు జమాబంది పద్ధతి నేర్పఱచెను. అక్బరు 'జిజియా' పన్నును దీసివేసెను. మతవివాదసభలు జఱపి మతముల సారాంశములఁ దెలిసికొనుచుండెను. అక్బరునకొక క్రొత్తమతముండెను. మసీదులను గుఱ్ఱపుశాలలుగా మార్చెను. గోహత్యను నిషేధించెను. గడ్డముపెంచుట, పినతండ్రి కుమార్తెను వివాహమాడుట మొదలగు మహమ్మదీయాచారముల నిరసించెను. తిలకమును ధరించెను. సూర్యోపాసనఁ జేయఁ దొడఁగెను.

ఇతని కాలములోనే 'ఈస్టిండియాకంపెనీ' యను పేరుతో నింగ్లండునుండి వర్తకసంఘ మొకటి ఇండియాకు రాదొడఁగెను. అక్బరునకు వార్ధక్యములో మనోవేదనఁ గలిగించు చిక్కులు సంభవించెను. పెద్దకుమారుఁడు 'సలీం' తిరుగఁబడెను. ఒకపుత్రుఁడు దక్షిణదేశపు దండయాత్రలో మృతినొందెను. తల్లిమరణించెను. ౧౬౦౫ లో నక్బరు లోకాంతరగతుఁడయ్యెను.

## ౨౦

జహాంగీరు — అక్బరు తరువాత నతని పెద్దకుమారుఁడు 'సలీం' జహాంగీర్ అను బిరుదుతో రాజయ్యెను. ఇతఁడు సుఖము మఱిగిన వాఁడు. కుమాళ్ళకు నితనికి సరిపడదు.



రాజపుత్రుఁడగు సలీం పారసీకస్త్రీని వివాహమాడుటకు మొదట తండ్రి యభ్యంతరముఁ బెట్టెను. అందుచేఁ దండ్రి మరణానంతరము రాజై సలీం పారసీకస్త్రీ యగు నూర్జహానుయొక్క భర్తనుజంపి యామెను జేబట్టెను. అప్పటి నుండియు నూర్జహానే రాజ్యముఁ జేసెను. జహంగీర్ యామె చెప్పు కథలతోఁగాలముఁ వెళ్ళఁబుచ్చుచు వచ్చెను.



జహాంగీరు.

జహాంగీర్ తనకుమారుఁడైన ఖుఱ్ఱమ్ అనువానిని పంపి యహమ్మదునగరుఁ గెలిచెను. ఖుఱ్ఱంకు నూర్జహానుయొక్కసోదరుని కుమార్తె యగు ముంతాజ్ మహాల్ను వివాహముజేసిరి.

2956

౧౬౦౮ లో వర్తకముజేయనుద్దేశముతో నింగ్లాండునుండి యొక యాంగ్లేయుఁడు సూరత్ పట్టణమునకుఁ వచ్చి జహాంగీరు రాజధానియగు ఆగ్రాలో గొంత కాలముండి యింగ్లీషువారి దేశములో వర్తకము జేసికొనుటకు రాజాజ్ఞఁ గోరెను. కోరిక నెరవేరినదికాదు. తరువాత ౧౬౧౫ లో

'సర్ తామస్‌రో' యను రాయబారి ఇంగ్లాండు రాజునుండి జాబుఁదెచ్చి పాదుషాకుఁ జూపెను. లాభము లేకపోయెను.

**షాజహాన్**—జహంగీర్ తరువాత ౧౬౨౮ లో 'షాజహాన్' బిరుదువహించి ఖుర్రం సింహాసన మధిరోహించెను. ఈతఁడు మహా వైభవముల ననుభవించెను. పోర్చుగీసు వారు [యూరపుదేశ వర్తకులు] సముద్రపు దొంగలతో గలసి యనేక దుష్కృత్యములు సేయుచుండుటచే షాజహాన్‌కు యూరపు దేశీయులపై క్రోధము జనించెను. వారిని హుగ్లి నుండి తరిమివేసెను.



షాజహాన్.

షాజహాన్‌కు దారా, సుజా, ఔరంగజేబు, మురాదను నలుగురు కొడుకులును, జహాన్ఆరా, రోషన్ఆరా అనుయిద్దరు కుమార్తెలు నుండిరి. వీరికి ముందెనిమిది మంది గతించిరట.

ఔరంగజేబు దక్షిణమున దౌలతాబాదులో షాజహాన్‌కుఁ బ్రతినిధిగానుండి గోలకొండను ముట్టడించెను.



గోలకొండ నవాబు ఢిల్లీశ్వరునకు సామంతుఁడయ్యెను. కొంత కాలమునకు అబూహాసన్ కుతుబ్‌షాహా అను వాఁడు తానీషా పేరుతో గోలకొండనవాబై ప్రజాక్షేమ మారసి హిందూ మహమ్మదీయుల నొకటిగ గౌరవించుచు వచ్చెను. పూర్వము తపశ్శాలియైన బ్రాహ్మణుఁడై తపోభంగము వలననిట్లు తానీషాయై పుట్టెనను వదంతిగలదు. ఇతనికి యక్కన్న మాదన్న లను సిద్ధ అన్నదమ్ములు మంత్రులుగా నుండిరి. వీరివంశీకులిప్పటికి నోరుగంటిలో నున్నారట.

శ్రీ శివాజికిని, తానీషాకును మంత్రులు స్నేహము కుదిర్చిరి. తానీషారాజ్యము నెప్పుడు మ్రింగుదునాయని నోరు దెఱచుకొనియున్న యౌరంగజేబు ఈ స్నేహమువిషయమై విని గోలకొండనుఁ దాకెను. మొగలులే పరాజయము నొందిరి. ఈస్టిండియా కంపెనీవారికి నౌరంగజేబునకు వైరము. అందుచే నింగ్లీషువా రక్కన్న మాదన్న మంత్రుల యనుగ్రహమున నిప్పుడున్న మైలాపూరు, ఎగ్మూరు అని పిలువఁబడు స్థలమును కౌలుకు తీసికొనిరి. శ్రీరామ భక్తాగ్రేసరుఁడగు రామదాసు మంత్రుల మేనల్లుఁడు. రామదాసు మొదటి పేరు గోపన్న. ఇతఁడు భద్రాచలమునకుఁ దహశ్శీలుదారుగా నియమింపఁబడెను. సర్కారు పైకము నంతయును శ్రీరాముని కైంకర్యమునకై వినియోగించి నందున రామదాసు నవాబుచే ఖైదుజేయఁ బడెను. బందిఖానాలో నుండగా

శ్రీరామలక్ష్మణులు రామదాసీయవలసిన పైకమును తానీషాకు చెల్లించి యాభక్తుని బంధవిముక్తిఁ జేసిరట !

(తుదకు గోలకొండ రాజ్యములోఁ గృతఘ్నులును, ద్వేషులునుబయలు దేరిరి. హిందువులకును, మసల్మానులకును (మహమ్మదీయులకును) పూర్తిగా వైరములుఁబెరిగెను. సమయమునకై వేచియున్న ఔరంగజీబు ౧౬౮౭ లో గోల్కొండను స్వాధీనముఁ జేసికొనెను.)

షాజహాన్ భార్యయైన ముంటాజ్‌మహల్ ఆమె మరణకాలమున భర్తవల్ల రెండు వగములు బొందెను. ౧. భర్త



తాజ్‌మహల్.



రెండవ వివాహముఁ జేసుకొనరాదు. ౨. ఆమెపేరు శాశ్వతముగ నుండునట్లొక గొప్ప కార్యముఁ జేయవలెను. అట్లే షాజహాన్ భార్యపేర నాగ్రాలో 'తాజ్‌మహల్' అను చలువరాతి కట్టడము నామె గోరిపై గట్టించెను. ప్రపంచములోని చరిత్రములలో నిది మిక్కిలి విచిత్రమైనది. అది యెప్పటికిని నేఁడునిర్మింపబడి నట్లే యుండునట. మనదేశములోని శిల్పకళ చాలవఱకు నిందుఁగాన నగును. ఇంకను ఢిల్లీలో జుమ్మామసీదును, ఆగ్రాలో మోతీమసీదును బహు సుందరముగఁ గట్టించెను. తాను కూర్చుండుటకు కోటకొలది ధనము వెచ్చించి మయూరాసనముఁ జేయించెను.

షాజహాన్ యొక్క చరమావస్థలో నాతని పుత్రులొండొరులు కలహించుకొనిరి. ఔరంగజేబ్, మురాద్‌ను దీసికొని యాగ్రాలోనున్న దారా, సుజాల మీదకు యుద్ధమునకుఁబోయెను. దారా, సుజాలు పాఱిఁబోయిరి. మురాదు తరువాత జంపబడియె. షాజహానును చెఱయందుంచి ఔరంగజీబు ౧౬౫౮ లో రాజ్యాధిపతి యయ్యెను.

## ౨౧

ఔరంగజేబ్ — మొగల్ చక్రవర్తులలో నీతఁడు నిరంకుశుఁడు. హిందువు లందఱను దన మతములోఁ గలుపుకొని వారి దేవాలయములను, మఠములను ధ్వంసముఁ జేసి మసీదుల యొక్క పునాదులలో వేయించెను. హిందువులు పండుగలు సేయరాదు. యాత్రలు మానవలెను. జిజియాపునరుద్ధరింపఁ బడెను. ఇదియన్యాయ మని మనవిఁజేసికొనినవారు శిక్షార్హులైరి. రాజపుత్రుల గౌరవింపఁ బడిరి. ఉదయపురములో రాజసింహుఁడు ఔరంగజేబునకు శత్రువయ్యెను.



ఔరంగజేబు.

మార్వాడ్ దేశపురాజగు యశవంత సింహుఁడు కాబూల్ దేశమునకు వెళ్ళియుండగా నౌరంగజేబాతని పుత్రు నిఁబిలిపించి చంపెను. పుత్రశోకముచే యశవంత సింహుఁడు మరణించెను. కాబూల్‌నుండి యాతనిభార్య యిద్దరు కుమారులతోఁ దిరిగి వచ్చుచుండఁ, దోవలో నామె నౌరంగజేబు బంధించెను. యశవంత సింహుని సర్దారుఁడు, వీర



దుర్గదాసు, వారిని విడిపించి జోధపురముఁ జేర్చెను. యశవంతసింహుని భార్య తన పెద్ద కుమారుఁడగు అజితసింహుని మార్వాడ్ దేశమునకుఁ రాజుగఁజేసి రాజసింహునితోఁ గలిసి యౌరంగజేబుపైకి యుద్ధమునకు వెళ్ళెను. ఈ సమయమున ఠాకూర్ దుర్గాదాసు చూపినయప్రతిహతమైన శౌర్యమునకును రాజపుత్రుల ధాటీకి నౌరంగజేబు తాళఁజాలక వారితో సంధిఁ గావించుకొనెను. రాజపుత్రులు సర్వ స్వతంత్రులైరి. బుందేల్ ఖండములో ఛత్రసాలుఁడు స్వాతంత్ర్యమునుఁ బ్రకటించెను. ఔరంగజేబాతనిఁ సాధించ నాలుగైదు వ్యర్థ ప్రయత్నములు సేసెను. మహమ్మదీయుల కపటోపాయములు ఛత్రసాలుని ముందుఁ బనికిరావయ్యె. అంత నౌరంగజేబు ఛత్రసాలునితో వైరముమాని మిత్రత్వము సంపాదించుకొనెను.

శివాజీ. ఈ సమయముననే మహారాష్ట్ర వీరుఁడగు శ్రీ శివాజి స్వరాజ్యమును స్థాపించి మహమ్మదీయుల గుండెలలో నిద్రపోవుచుండెను. ఇతఁడు క్రీ. శ. ౧౬౨౭ లో జన్మించెను. అతనితల్లి యాతనికిఁ జిన్ననాటనుండియుఁ బోధించుచు వచ్చిన పూర్వుల పరాక్రమ చరితంబులును, పురాణకథలును శివాజిని గొప్పవీరునిగాఁ జేయఁగలిగెను. శివాజికి భారత కథ యనిన మహాప్రేమ. ఇతఁడు మొదటనుండియు స్వాతంత్ర్య ప్రియుఁడు. ఎప్పుడును నవాబులకు సలాముఁజేసి యెఱుఁగడు. ఈమహావీరుఁడు పరస్త్రీని తల్లితోసమానముగా గౌరవించును. ఈతఁడొక సమయములోఁ దన రాజ్యమంతయు గురువునకు



శివాజీ.

దక్షిణగా నర్పించిన సర్వసంగ పరిత్యాగి. గురువాజ్ఞ మీఁద దశరథ కుమారుఁడు భరతునివలె రాజ్యముఁ జేసిన గురు భక్తుఁడు. మతాంతరులలోఁ గొందఱీతని దొంగయనియు, మోసగాఁడనియు నిందించిరి. మనవారును వారి పాటే బాడిరి. ఇది కేవల మసూయచేతను, పక్షపాత బుద్ధిచేతను వేసిన నిందయని శివాజి చరిత్రము పూర్తిగాఁ జదివిన వారికి దెలియగలదు. మహమ్మదీయుల దుండగముల నణచి హిందూ సామ్రాజ్య స్థాపకుఁడైన శివాజి ౧౬౮౦ లో నస్తమించెను. నాటినుండియు భారత దేశీయు లంధకారములో దారిఁగానక తారట్లాడు చుండిరి. ఇప్పటి కాదుర్దినములు చెల్లిపోలేదు.

శివాజి మరణానంతర మౌరంగజీబు బిజాపుర, గోల్కొండ రాజ్యములను జయించెను. కాని మహారాష్ట్ర వీరులు మరల స్వతంత్రులై కోలుపోయిన దుర్గములను స్వాధీనముఁ జేసికొనిరి. చివఱకు నౌరంగజీబు విఫల మనోరథుఁడై



తాను జేసిన యన్యాయములకై పశ్చాత్తప్త హృదయుఁడై, తన నేరములను మన్నించ వలసినదిగా దైవమును బ్రార్థించుచు ౧౭౦౭ లోఁ బరగతుఁడయ్యెను. ఇతని కాలములో మద్య పానము, నాచ్ (నృత్యవిద్య) పూర్తిగా నిషేధింపఁబడెను. హిందువులు మహమ్మదీయులు చాలకాలముఁ గలిసియుండుటవల్ల 'నానక్' అను సాధువు రెండు మతములలో నుండి కొన్ని సిద్ధాంతముల దీసి 'సిక్' మతమనుపేర వానిని బోధింపసాగెను. వీరి మతగ్రంథము 'గ్రంథసాహెబ్' ఈమత గురువులను మొగల్ చక్రవర్తులు గౌరవించిరి. తరువాత కాలానుగతముగా సిక్మతగురువులు సాధువృత్తిని వదలి రాజసవృత్తి నవలంబించిరి. అందుచే మతగురువులకును చక్రవర్తులకును యుద్ధములు తటస్థించెను.

## ౨౨

ఔరంగజేబ్ మరణానంతరము వచ్చిన రాజులలో 'ఫరుఖ్ సియర్' అనువాఁడు ఈస్టు ఇండియా కంపెనికి బంగాళా దేశములోఁ గొన్ని స్థలముల నిచ్చెను. తరువాతఁ గొంత కాలమునకు మొగల్ రాజ్యము విచ్ఛిన్నము గాఁజొచ్చెను.

దక్షిణమున 'నిజాముల్ ముల్క్' స్వతంత్రుఁడయ్యెను. ఇతఁడు మొగల్ రాజ్యమును కొంతకాలము నిల్పెను. ఇతను

హైదరాబాదులో రాజ్యముఁజేసి శతవృద్ధుఁడై చనిపో
అనంతరము పారసీకరాజగు నాదర్‌షాహా హిందూదేశ
దాడివెడలి ఢిల్లీనంతయు నాశనముఁజేసి షాజహానుయె
మయూరాసనముఁ దీసికొనిఁ బోయెను. తరువాతఁ గ
కాలమునకు ౧౮౦౩ లో ఢిల్లీ యింగ్లీషు వారి సా
మయ్యెను. మొగలువంశ మంతరించెను.

---

రామా ముద్రాక్షరశాల, ఏలూరు. 3—12—27.

